రాఘవయ్య చౌదరి, సూర్యదేవర

# బ్రాహ్మణేతర విజయము

తెనాలి, 1925

Record no. 27

Rāghavayya Caudari, Sūryadēvara

Brāhmaṇētara vijayamu

Tenāli, 1925

Record no. 27

## Bibliographic Record Target

రాఘవయ్య చౌదరి, సూర్యదేవర.
బ్రాహ్మణేతర విజయము / గ్రంథకర్త సూర్యదేవర రాఘవయ్య చౌదరి. - 1. ముద్రణ. - తెనాలి : రైతు ముద్రణాలయము, 1925.
(1) 6, 3, 149 p., 2 ports. ; 22 cm.
Record no. 27

Rāghavayya Caudari, Sūryadēvara.
Brāhmaṇētara vijayamu / granthakarta Sūryadēvara Rāghavayya caudari. - 1. mudraṇa. - Tenāli : Raitu Mudraṇālayamu, 1925.
(1) 6, 3, 149 p., 2 ports. ; 22 cm.
Record no. 27

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB     Date filming began:

శ్రీ

# బ్రాహ్మణేతర విజయము.

గ్రంథకర్త

సూర్యదేవర రాఘవయ్య చౌదరి.

కొల్లూరు.

తెనాలి

[illegible] ముద్రణాలయమునందు ముద్రించి

రైతు [illegible]

ప్రకటింపబడెను.

ప్రథమ ముద్రణము 1000 ప్రతు.

1925

వెల 0—12—0]



సహాయకులు.

మాదల వెంకట్రామయ్య చౌదరి,

క్రొప.

# అంకితము.

స్వార్థత్యాగులై బ్రాహ్మణేతర సౌభాగ్యమే తనపరమావధిగానెంచి, జీవిత సర్వస్వమును బ్రాహ్మణేతరోద్యమమునకు ధారవోసిన బ్రాహ్మణేతరోద్యమ స్థాపనాచార్యులైన కీర్తిశేషులగు డాక్టరు టి మాధవనాయరుగారి యాత్మశాంతికై యీచిన్ని పొత్తము నంకిత మొనర్చుచుంటి.

ఇట్లు

గ్రంథకర్త.

# విజ్ఞప్తి.

సత్యాసత్య విమర్శకులారా.

శ్రీమత్పరమహంస గోపాల సచ్చిదానంద బ్రహ్మేంద్ర సరస్వ స్వాములవారు క్రీ॥ శ॥ 1916వ వత్సరారంభమున కమ్మ, రెడ్డి వెలమ, బలిజ, శాఖలవారు శూద్రులను నూహతో వేదాధికారవ గలదని కొల్లూరునందు వాదనజేయు తరుణమున కమ్మ, రెడ్డి మున్న శాఖలవారు శూద్రులుగారనియు క్షత్రియులనియు నేనచింప శ్రీస్వాములవారికిని నాకును యందును గురించి కొంతచర్చ జరిగిన పిమ్మట యీశాఖలవారు క్షత్రియులను నావాదనను శ్రీస్వాములవారంగీకరించి వారును కొన్నిగ్రంథములు పరిశీలనజేసి జయార్థ ప్రకాశిక 3వ భాగమున నాశాఖలవారు క్షత్రియులని నిరూపించినారు. నేను కమ్మవారిచరిత్రమును వ్రాసి సోదరుల కర్పించుకొంటి. యీగ్రంథ ద్వయము ననుసరించి తగు చర్చలో సిద్ధాంతపర్చుకొను తలంపుతో బ్రాహ్మణానుకూలురగు కమ్మవారు కొందరుభయ పార్టీలను కోరి పుష్పగిరి పీఠమువారికిని మాకు నాల్గు దినములు కొల్లూ వాద ప్రతివాదములు జరిగినవి. యీవాదనలో మావాదనను త్రో జాలక అఖిల పీఠాధిపతులకు దెల్పి వారి యభిప్రాయమును సుకొని తమ యభిప్రాయమును లిఖిత పూర్వకముగ నైదు మాసము దెల్పెదమని పీఠమువారు జెప్పిరి.

త్రమును గురించి శ్రీపుష్పగిరి పీఠమువారికిని మాకును వాద ప్రతివాదనలు జరిగినవి. అందు జరిగిన వాద ప్రతివాదనల్ల సారాంశము.

ప్రథమ దివసచర్య:—

శ్రీయుత సూర్యదేవర రాఘవయ్యా చౌదరిగారి,

ఉపన్యాసము.

కమ్మవారు వైదిక మతానుసారము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర యను చాతుర్వర్ణములలో నేవర్ణములో జేరుదురా యని యోచించుటకు ముందు వర్ణవిభాగమెటుల నేర్పడెనో విచారించిన గాని కమ్మవారే వర్ణజులో నిరూపించ వీలులేదు. ఈవర్ణ విభాగము గుణకర్మల ననుసరించి యని కొందరును, పుట్టుకచే నని కొందరును వాదనల జేయుచున్నారు. ఈద్వివిధంబులలోను ప్రథమమున గుణకర్మలచేతనే వర్ణవిభాగము గావించిరని యనేక ప్రమాణము లుద్ఘోషించుచున్నవి. అందులకు ప్రమాణములం గొన్నిటిని నిరూపించెద. చిత్తగింపుడు.

శ్లో॥ తమశ్శూద్రేరజఃక్షత్రే బ్రాహ్మణే సత్వముత్తమమ్॥

అనగా తమోగుణమునకు శూద్రయనియు, కించత్తమోగుణముతో గూడిన రజోగుణమును వైశ్యయనియు, రజోగుణమును క్షత్రియయనియు, సాత్విక గుణమును బ్రాహ్మణయనియు భాగించిరి. వెండియు,

శ్లో॥ నచర్మణోనరక్తస్య నమాంసస్యనచాస్థినః। నజాతిరాత్మనో
జాతిర్వ్యవహారేణ ప్రకల్పితాః॥ నిరాలంబోపనిషత్.



చర్మమునకు జాతిలేదు. రక్తమునకు జాతిలేదు. మాంసమునకు జాతిలేదు. ఎముకలకు జాతిలేదు జీవునకు జాతిలేదు. జాతి యనడము వ్యవహారమునకు కల్పితము.

ఇటులనెన్నియో ప్రమాణములు గుణకర్మములననుసరించియే వర్ణవిభాగంబని ధృవపరచుచున్నవి. కాని కొందరిపుడు 'బ్రాహ్మణోస్య ముఖమాసీత్', అను ఋక్కునకు బ్రాహ్మణులు ముఖమందుబుట్టిరనునర్థము జెప్పుచు వర్ణవిభాగము పుట్టుకచే ననివాదించుచున్నారు. అటులనా ఋక్కునకుపై విధమున నర్థము చెప్పునెడల, బ్రాహ్మణోస్యముఖమాసీత్, అను ఋక్కునకుతరువాత. చంద్రమా మనసో జాతశ్చక్షుస్సూర్యఅజాయత అనియున్నది. ఈఋక్కునకు మనస్సునకుచంద్రుడు, చక్షువులకు సూర్యుడు బుట్టిరని వైవిధముగ నర్థముజేయునెడల 'బాహూ రాజన్యః కృతః' అనువాక్యానుసారమున "చంద్రమా" అను ఋక్కుచేసూర్య చంద్రులు భుజములందుబుట్టకపోవుచేట క్షత్రియులు గారనవలయు. సూర్యుడు, చంద్రుడు క్షత్రియులుగానియెడల సూర్య చంద్రవంశజులు క్షత్రియులుగారనవలయు. అయ్యదిలోకవిరుద్ధముగావున 'బ్రాహ్మణోస్యముఖమాసీత్' అనుఋక్కుపుట్టుకచే వర్ణవిభాగంబని నిరూపణజేయుటలేదని ధృవంబగుచున్నయది. ఈప్రమాణవచనములనన్నింటిని కడద్రోసి పుట్టుకచేతనే వర్ణవిభాగంబని వాదించుచున్నవారికి గొన్ని ప్రశ్నలిచ్చెద. జవాబొసంగుడు.

(1) కర్ణధర్మజుల జన్మకథనము, వర్ణములేమి?

(2) కృపుని జన్మకథనము, పెంచినవారు, వర్ణములేమి?

గాఁడిదని సేర్పరుపగలముకాని మనుజులయందు చూచి చూచుటకో డనే వర్ణవిభాగము చేయలేముగదా.

6. ఒక్క జన్మమునందే వర్ణాంతరమును బొందిన మహాను భావులు భారత భాగవతమునందలి వంశవృక్షమును పరీక్షించి చూచిన యెడల బోధపడగలదు. కుటుంబములు, కుటుంబములు వర్ణాంతరమును బొందినట్లు గన్పట్టు.

7 జర్మనులు, మహమ్మదీయులు హిందువులుకారు. హిందువులనుగూర్చి యేస్మృతులు వ్రాయఁబడినవి. ఇట్టిసందర్భములో హిందేతరులను గూర్చి మాటాడుట యవివేకము.

పెక్కుమాటలేల ? ఏనాఁడు బ్రాహ్మణులు రెడ్డి, వెలమ, కమ్మ ప్రభృతులచే పరిపాలింపబడుచున్న తెలుగు దేశమున కాపురము చేయుట కారంభించిరో, యానాఁడే పైవ్రాయఁబడిన జాతులు క్షత్రియ శాఖలైనను కావలయును, లేదా బ్రాహ్మణులు, బ్రాహ్మణులైనను కాక పోవలయును.



# బ్రాహ్మణేతర విజయము.
# కమ్మవారి చరిత్రము.

## ఉభయవాద సంగ్రహము.

సీ॥ క్షత్రియులమని భు ♦ జంబు దట్టినలేదు।
సమయ మేతెంచెను ♦ క్షాత్రమునకు।
కమ్మవీరులమంచుఁ ♦ గాలుద్రవ్వినలేదు।
సమయమేతెంచెను ♦ క్షాత్రమునకు।
పౌరుషజ్ఞులమంచుఁ ♦ బలుక లాభములేదు।
సమయమేతెంచెను ♦ క్షాత్రమునకు।
ఐకమత్యమటంచు ♦ నార్భటించినలేదు।
సమయమేతెంచెను ♦ క్షాత్రమునకు।

గీ॥ ధనికులమటంచు మదిలోనఁ ♦ దలఁచవలదు।
పలుకుబడి గలదంచెదఁ ♦ గులుకవలదు।
క్షాత్రధర్మంబు జూపెడి ♦ సమయమిదియె।
సరసమతులార చౌదరి ♦ సభ్యులార॥

బాలకవి కొసరాజు రాఘవయ్య చౌదరి.

కొల్లూరు గ్రామమున పందొమ్మిది వందల యిరువది నాల్గవ సంవత్సరము ఆగస్టు 16, 17, 18, 19వ తేదీలయందు కమ్మవారి చరి

చెవ్రాసితి. ఇందలి సత్యాసత్యముల నారసి కృపతో దెలుప ప్రా
ర్తములే కర్తలు. అట్లు తెలిపిన విషయములలో సవరించుకొనవల
యంశములున్నతలయొగ్గి సవరించుకొందునని విషయ పూర్వకముగ తెలు
పుకొనుచున్నాను. ఇందు ప్రథమ భాగములో చేర్పవలసిన ముఖ్యవి
ములలను శ్రీమత్పరమహంస స్వామి జి. యస్. బి. సరస్వతిగారి
క్క ఉపన్యాసము లభింపమిచే చేర్చలేదు. శ్రీయుత బారిష్టర్ శ
ధాని త్రిపురనేని రామస్వామి చౌదరిగారి యుపన్యాస సారముమా
మఅచ్చు పూర్తియయిన పిమ్మట లభించుటచే వేరుగా కూర్చుట
నది. నాల్గవభాగమున బ్రాహ్మణేతరులు విద్యా ధన గౌరవాదుల
దుటను గురించి జపతప యజ్ఞయాగాది క్రతువులు సేయుటనుగు రి
యనర్హులని బ్రాహ్మణుల శాసనములు దర్పణముభాతిగన్పట్టుచున్న
గదా ఇట్టిస్థితిలో రాజ్యాంగమువారి నిరంకుశత్వము రూపుమాపయత్ని
చుచున్న యిక్కాలమున బ్రాహ్మణుల నిరంకుశత్వమును రూపుమా
బ్రాహ్మణేతరులకు మనస్వాతంత్ర్యత సంపాదింపబూనుట దేశానర్థక
మను నవ్యక్తపు వాదనజనించుటకు హేతువెద్దియో నిరూపించజాల
కున్నాను.

అయితే యితరులువచ్చి దేశమనెడిగృహమున కగ్ని ముట్టించు
చుండ దేశజులలో నొకరితో నొకరు కలహించుట భావ్యముగాదని
యవిచారణతో చెప్పవత్తురోమో! అన్యదేశీయులువచ్చి దేశమను
గృహమున కగ్నిముట్టించుచుండిరని యొప్పుకొందము. ఈ బ్రాహ్మ
ణులుచేయు ఘనకార్యమేమి? దేశమనెడి గృహమున కల్పత్వ నీచత్వ
ములనారోపించి బడబాగ్ని ముట్టించినారు. విదేశీయులగ్ని ముట్టించుట



కంటె స్వదేశీయులు బడబాగ్నిని ముట్టించుట అతిఘోరము. రాజ్యాంగ
మువారి చేదములగ్నివంటివైన బ్రాహ్మణులచర్యలు బడబాగ్నివంటి
వనుట నిర్వివాదాంశము. ఎటులగా

| | |
|---|---|
| రాజ్యాంగమువారు | బ్రాహ్మణులు |
| విదేశీయులు | స్వదేశీయులు |
| అన్యమతస్థులు | ఏకమతస్థులు |
| నిరంకుశత్వము రాజకీయ | నిరంకుశత్వము సాంఘిక ఆర్థిక |
| ములకదు మాత్రమే | రాజకీయాదులయందు |

ఈ పైవిషయంబుల పరిశీలించి నాల్గవభాగము పఠించినవా
రికి బ్రాహ్మణుల శాసననిరంకుశత్వమే హెచ్చని సుబోధకంబగును.
అందుచే బ్రాహ్మణేతర మనస్వాతంత్ర్య తనపహరించి సాంఘిక ఆర్థి
కాది విషయంబులలో ననర్హులజేసిన బ్రాహ్మణులచర్యలు బడబాగ్ని
వంటివనుట చెల్లును. ఈపొత్తమున బొందుపఱుపబడిన బ్రాహ్మణకల్పిత
ప్రమాణములు బ్రాహ్మణేతరుల నెంతయల్పత్వ నీచత్వములకు బాల్ప
డజేసి యఖిలసంపదల కనర్హులగావించినది దర్పణము భాతిగన్పట్టు
చున్నయది భారతీయులలో జనసంఖ్యయందు 100కి 97రుగల బ్రాహ్మ
ణేతరసంఘమును 100కి ౩రుగల బ్రాహ్మణసంఘము యిట్టి యల్పత్వ
నీచత్వములకు బాల్పడజేసియుండ తన్నివారణ జేయుటవసరము.
స్వరాజ్య సంపాదనమాత్రము చేయుదమనుట యనాలోచితము అల్ప
త్వనీచత్వముల నంగీకరించిన యగౌరవాపేక్షపరుల రాజ్యసంపాదన
జేయుటయు నున్నదే. అథవాగల్గినను స్థిరముగానిల్చుటయు నున్నదే
మిమిటుల వ్రాయుట స్వరాజ్యమక్కర లేదనుటకుగాదు. స్వరాజ్యసం
పాదనతోబాటు సాంఘికాది విషయంబులలో మనోస్వాతంత్ర్యతను

(3) కర్ణుడు మరణపర్యంతము శూద్రుఁడని వ్యవహరింపఁబడుటకు కారణమేమి?

(4) ఋషభమహారాజునకు ఏకసతియందు గల్గిన నూర్వురు పుత్రులలో కొందరు బ్రాహ్మణులు, కొందరు క్షత్రియులనగుటకు కారణమేమి?

(5) భాగవతమునందలి రంతీదేవునిచరిత్రమునందు చెప్పినచంద్రవంశజులగు క్షత్రియులు బ్రాహ్మణులెట్లైరి.

గుణకర్మలచే వర్ణవిభాగంబను చట్టమునను సరించి క్షత్రియ చిహ్నమగు రజోగుణముతో గూడినవారై నిన్న మొన్నటివఱకు నాయుధజీవులై యున్న కతనకమ్మవారు క్షత్రియులనుటకర్హులు. అథవా క్షత్రియుల కుండవలసిన గుణకర్మలసంపూర్తిగా నున్నందున నటులనుటకు వీలులేదందురా! ప్రస్తుతము బ్రాహ్మణులమనుకొనువారి యందంతకన్న తక్కువగ బ్రాహ్మణ గుణకర్మలుండి వారెటుల బ్రాహ్మణ నామమున కర్హులో యటులనే కమ్మవారును క్షత్రియ నామమున కర్హులు. అదియునుంగాక గుణకర్మలచే వర్ణవిభాగంబను చట్టము ననుసరించి ప్రత్యేక వ్యక్తులగుణకర్మల ననుసరించి వర్ణవిభాగము గావింపవలె నందురా? అధర్మమన్ని కులములకు జెందిన కమ్మవారికిని జెందును. (అప్పుడీదేశము మహోన్నత పదపినఁదును.) కావున గుణకర్మల ననుసరించి వర్ణవిభాగంబను చట్టము ప్రకారము కమ్మవారు శూద్రులు గారనియు, క్షత్రియులనియు దేలుచున్నది. ఇక పుట్టుకచే వర్ణవిభాగచట్టము ప్రస్తుతమమలులోనున్నదాని ననుసరించి విచారించిన కమ్మవారు క్షత్రియులని



ష్టే తెల్లంబగుచున్నది. ఎటులన పుట్టుకచే వర్ణవిభాగంబను నపుడు వంశానుక్రమణి ననుసరించి వర్ణవిభాగము గావింపవలె. అందును గూర్చి యీకమ్మవారి పూర్వులెవరాయని విచారింప (ఆంధ్రుల చరిత్ర ద్వితీయ భాగము ననుసరించి) కోటకేతరాజు; కొండపడమటి బుద్ధరాజు కమ్మవారుగవ్యవహరింపఁబడినటుల దెలియుచున్నది. ఆపురుషద్వయముయొక్క చరిత్రమును బట్టిచూడ వారు (1) దుర్జయ కులాభరణులమనియు. (2) బుద్ధవర్మ వంశములోని వారమనియు. (3) చతుర్థాన్వయులమనియు చెప్పుకొనినటుల విశదమగును. అందు దుర్జయ కులాభరణులనగా దుర్జయుని కులము వారనియు, బుద్ధవర్మ వంశమనగా బుద్ధవర్మనుండి చీలినశాఖ వారమనియు, చతుర్థాన్వయులనగా నాల్గవగోత్రము గల వారనియు నర్థములు. వారుదహరించిన యీవాక్యములఁబట్టి చూడగా కమ్మవారి కాదిపురుషుఁడు దుర్జయుఁడైనటుల సిద్ధాంతంబగుచున్నది. ఇటుల దుర్జయ కులాభరణులమని చెప్పుకొనినది కమ్మవారేగాక కాకతీయులును. పాగివంశము వారును గలరు. వీరందరికిని మూలపురుషుఁడైన దుర్జయుఁడే కులమువాఁడని విచారించిన కాకతీయ గణపతిదేవ చక్రవర్తి శాసనములో నావిషయము సవిస్తరముగా వివరింపఁబడినది. ఎట్లనగా.

గణపతి దేవచక్రవర్తి శాసనమున సూర్యవంశమున మనువు, అతనివంశమున నిక్ష్వాకువు, అతనివంశమునరఘువు, అతనివంశమునదాశరథి, అతని వంశమునఁ గరికాలచోడుఁడు, అతని వంశమున దుర్జయుఁడు, అతని వంశమున కాకతీబేతరాజు జనించిరని చెప్పబడియున్నది. (కాని దాశరథి వంశమునఁ గరికాలచోడుఁడు బుట్టినటుల తత్పూర్వ

సంపాదించి యింతదనుక నారోపింపబడిన యల్పత్వ నీచత్వములను హరింపజేసి ఆత్మగౌరవాభివృద్ధి గావించుకొనవలెనని మాతలంపు. ఇ బ్రాహ్మణేతరసంఘము సాంఘికసత్వసంపాదన జేయుట ముఖ్యమ ఆంధ్రపత్రికయు వచింపుచుచున్నది. యీవాక్యముల నీక్రింద పొందు పరచెద చిత్తగింపుడు.

సాంఘికార్థికాదుల విషయమై బ్రాహ్మణేతర సంఘము నిరం తరము దేశక్షేమమునకై కృషిజేయవలసియున్నది.

బ్రాహ్మణేతరోద్యమమును తిన్నగ నడుపుచో నెట్టియాశే వ యుండజాలదు ఏలనన ప్రజాసామాన్యమందు యధిక సంఖ్యాకుల బ్రాహ్మణేతరులగుటచే వారియభ్యుదయమే హిందూదేశాభ్యుదయ మగును. ఇంతకన్నను కావలసినదేమిగలదు? బ్రాహ్మణేతరోద్యమము రాజకీయరూపముదాల్చక సంఘోద్ధరణకై కృషిసలిపియున్నచో అయ్యది దేశమున కమూల్యమైన లాభమును కలిగించెడిది. నానాటి కృశింపుచున్న సంఘమతసంస్కరణములకు తప్పక ప్రోద్బలము కలిగిం చియుండెడిది.

బ్రాహ్మణేతరులను ఆర్థికముగనేమి సాంఘికముగ నేమిపైకి దెచ్చుటకీయుద్యమము నుపయోగించుచో దేశమునకు లాభము కలు గుననుటకు సందియములేదు.

ది 26-4-25 ఆంధ్ర దినపత్రిక
ప్రధానవ్యాసము.

చదువరులారా. విప్రవిచేష్టితము చూచినను ఆంధ్రపత్రికాభిప్రా యమును చూచినను సాంఘికసత్వసంపాదనకునై బ్రాహ్మణేతరోద్యమ ము ముఖ్యమని సుబోధకమగుచున్నది. యీసన్మార్గమును గనిపెట్టిన



జస్టిసుపార్టీకన్న నొక వత్సరముముందు బ్రాహ్మణేతరోద్యమమును జనింపజేసి యిల్లు వల్లు గుల్ల యయినను నాసదుద్యమాభివృద్ధికి నిరంతము సేవజేయుచున్నాను. ఇయ్యది యామోదనీయమని సర్వేశ్వ రుడుతోవజేసిన స్వీకరింపుడు లేకున్న విసర్జింపుడు. గాని మంచిచెడ్డ లను విమర్శించి కర్ణుని జన్మకథనమును గోప్యముజేసిన కుంతివలె గోప్యము చేయక తెలుపుటకు వినయముతో వేడుచున్నాను.

శ్రీపుష్పగిరి పీఠమువారు కమ్మ, రెడ్డి, బలిజ, శాఖలవారిని గురించి నవీన కల్పనలతో బహు నిందాస్పదముగ వ్రాయుటజూచి సహించలేని నాపామరత్వముచే నేనుకూడా కొన్నితావుల వారిని గురించి తూలుగవ్రాసితి. ఆకారణమున నావాదనను త్రోసివేయక కౌరవసభలో ద్రౌపది ప్రశ్న కానము వహించిన భీష్మాది కురు వృద్ధులవలె మౌనము ధరించక యిందలి మంచి చెడ్డలను విమర్శించి నిరూపించ పాఠకోత్తముల మరి మరి వేడుచుంటి.

ఈగ్రంథ ప్రచురణకు సర్వవిధముల సహాయముజేసిన మాదల రామయ్య చౌదరిగారికిని, ఈగ్రంథము వ్రాయుటకు కావలసిన గ్రంథముల నొసంగిన కొల్లూరు విద్యార్థి బృందమువారికిని, విశ్వబ్రాహ్మణ బాల సమాజమువారికిని నాకృతజ్ఞతా వందనములు. మాసాంఘికోద్యమమును సోదర ప్రేమతో గౌరవించిన జస్టిసు సంఘమువారికి నావందనములు

ఇట్లు "స్వకార్యహానికి జంకక నిందలి తప్పులను సవరించి శుద్ధ ప్రతి వ్రాసియిచ్చిన విద్వాన్ తాప్యారి రాఘవయ్య చౌదరిగారికిని ఆయా భాగముల కనువగు నర్థములుగల పద్యముల నొసంగిన శ్రీయుత బాలకవి అష్టావధాని కొసరాజు రాఘవయ్య చౌదరిగారికిని కృతజ్ఞతానేక వందన శతంబులు సమర్పించు"

కొల్లూరు
తెనాలితాలూకా
గుంటూరు జిల్లా.

గ్రంథకర్త,
సూర్యదేవర రాఘవయ్య చౌదరి.

శాసనములుగాని, చరిత్రలుగాని, పురాణాదులుగాని నిరూపింపలేదు. దీనినిబట్టి విచారింపగా దుర్జయుఁడు కరికాలచోడుని వంశములో వాఁడనగా చోళులలోనివాఁడని ధృవంబగుచున్నది.

సదయ హృదయులారా! ఇంతవఱకు పరిశీలించిన చరిత్రమును బట్టిచూడ (1) కమ్మవారు, (2) కాకతీయులు, (3) సాగివంశమువారు దుర్జయ కులాభరణులనియు, చోడులలోని వారనియు సిద్ధాంతమైనది. ఈమూఁడు శాఖలలో కాకతీయులు నేఁడు మందపాటివారను గృహనామముతో సూర్యవంశపు క్షత్రియులుగఁ బరిగణింపఁబడుచున్నారు. సాగివంశమువారు నేఁడు వత్సవాయి యను గృహనామముతో సూర్యవంశపు క్షత్రియులుగ వ్యవహరింపఁబడుచున్నారు. కమ్మవారని వ్యవహరింపఁబడిన కోటకేతరాజు వంశజులు నేఁడు దంతులూరివారను గృహనామముతో సూర్యవంశపు క్షత్రియులుగ వ్యవహరింపఁబడుచున్నారు.

వీరందరటుల వ్యవహరింపఁబడుచుండ నేఁడు కమ్మవారిని గురించి యీచర్చ గలిగిన కారణంబేమనఁగా, వారెల్లరు సూర్యవంశజులని వ్యవహరింపఁబడుట గణపతిదేవ చక్రవర్తి కిటీవలనేగాని తత్పూర్వము లేదు. పూర్వమువారు వైదిక మతమెఱుఁగనపుడు తమ దేవర్ణమో నిరూపణజేయుటకు పిమ్మట వైదిక మత ప్రచారకులు మనదేశమువచ్చిన వెంటనే సూర్య చంద్ర వంశములకు భిన్నమైన క్షత్రియ కులముగ నిరూపణజేయుచు నటువెన్క తాము వైదిక మతమవలంబించిన దాది సూర్యవంశపు క్షత్రియులుగఁ జేర్కొన సాగిరి. వారు వైదిక మతమవలంబించినపుడు గుణకర్మలచే వర్ణవిభాగము గావింపఁబడుచుండెను. పిమ్మట



సిద్ధాంత మటుంచి పుట్టుకచే వర్ణవిభాగ మేర్పడునపుడే యంతదనుక జన్నిదములు ధరించినవారు శూద్రులనియు, వారికి వేదాధికారము లేదనియు నేర్పఱచిరి. (అటుల మార్పుగలుగుటచేతనే వర్ణవిభాగమును గూర్చియు, వేదాధికారమును గూర్చియు చర్చలుజేయు ఉభయవాదనలకు ప్రమాణములు లభించుచున్నవి.) అటుల మధ్యకాలమున వైదికమతచట్టము మార్పొందుటకుపూర్వము కమ్మవారనుశాఖలో జేరిన వేణ్ణియభట్టు, దేవనయ్యమున్నగువారు వైదికమత మవలంబించి యజ్ఞయాగాది క్రతువులుజేసి బ్రాహ్మణులై యప్పటి రాజలోకము కడ నగ్రహారములు బొందిరి. (వారి శాఖవారిప్పుడు బ్రాహ్మణులలో జేరి కమ్మవారనగా శూద్రులనుటకు వెనుదీయకుండిరి.) వైదిక చట్టము మార్పొందిన పిమ్మట కొంతకాలమునకు వైదికమతాచరణ పరులైనందున నొడ్డెలు, కాళింగులు, సాలీలు, భట్రాజులు మున్నగువారు ఉపనయనమును జేయించుకొనుచుండినను శూద్రస్వరూపముతో మెలఁగుచుండిరి. కమ్మవారో! ఉపనయనాది క్రియాలోపములతోనున్నను ఒడ్డెలు, సాలీలు మున్నగువారి కందరికన్న మిన్నలని వ్యవహరింపఁబడుచున్నారు అటుల వ్యవహరింపఁబడుచుండినను వీరు శూద్రవృత్తులు లేక నాయుధోపజీవులై యున్న కతన శూద్రులని యెవ్వడు నే గ్రంథమునందును, నే శాసనమందును వక్కాణింపఁబడక చతుర్థాన్వయులనియు, చతుర్థ వంశజులనియు, చతుర్థ కోటియనియు, గంగకు సైదోడులై శ్రీహరి పాదపద్మములందు బుట్టిరనియు నిగూఢపద ప్రయోగములతో వ్యవహరింపఁబడుచుండిరి. గాను గాను యిటీవల మాత్రము శూద్రులను వాదనలు బయలుదేరుచున్నవి. ఏవాదనలెట్లు బయల్వెడలినను పుట్టుకచే వర్ణవిభాగం

బను చట్టము ననుసరించి ప్రత్యక్ష ప్రమాణముల దుర్జయ కుల
కొందఱు ద్విజులుగ నేడుపరిగణింపఁ బడుటచేత వీరును ద్విజులను
కావంతయు సందియములేదు. మఱియు నొక్కవిశేషంబు తిలకింపుడు
కమ్మవారు చోడులైన, వెలమవారు, బలిజవారు, రెడ్డివారలెవర
ప్రశ్నించెదరేని వినుఁడు. కమ్మ రెడ్డి శాఖలవారు చోడులు, వెల
బలిజ శాఖలవారు చాళుక్యులు. ఇందును గురించి ప్రమాణము లనే
ములు గలవు. గ్రంథ విస్తరభీతిచే వివరింపనైతి.

సత్యాసత్య విమర్శకులారా! యింతదనుక విమర్శించిన యం
ములటుంచి వర్తమానకాలమున కమ్మవారియాచరణ ననుసరించియు
వీరు శూద్రులుగారని ధృవంబగుచున్నది ఎటులనగా వీరికి జన్నిదము
లేనందున శూద్రులనుటకు జన్నిదములు గలవారిని శూద్రులనరాదు గ
దా! అటులగాక జన్నిదములు గలవారినిసైతము శూద్రులనుటచే వీ
జన్నిదములు లేనంతమాత్రమున శూద్రులనరాదు. మరియు వేదోక్త
కర్మలు లేనికారణముచే వీరు శూద్రులా యనుకొనుటకు ద్విజులలో
జేరినకోమట్లకు వేదోక్తము లేకపోయినను శూద్రులనుట లేదు. గావు
వేదోక్తము లేనంతమాత్రముచే వీరిని శూద్రులనరాదు అదియునుగా
వీరికి ఋషిగోత్రములు లేనికారణముచే శూద్రులాయని తలంచుటకు
కోమట్లకు ఋషి.గోత్రములులేవు వారిని శూద్రులనుటలేదు భట్రా
లకు ఋషిగోత్రములుగలవు. వారినిద్విజులనుటలేదు మరియు గోత్రము
లా వంశమూలపురుషుని దెలుపుటకుబుట్టినవిగాని వర్ణనిరూపణకు
బుట్టినవిగావు. కనుక ఋషిగోత్రములు లేనంతమాత్రముచే వీరిని శూ
ద్రులనరాదు. వీరునిన్న మొన్నటి వఱకునాయుధోప జీవులై యుండిరి
నేడు వృత్తినిబట్టి శూద్రులనుటకు వైశ్యవృత్తియగువ్యవసాయ పశు



రిపాలనయే వీరాచరించువృత్తి అందుచే శూద్రులనరాదు అదియు
నుంగాక అమరము. మనుస్మృతి మున్నగు గ్రంథములలో శూద్రుల
లోగల అంతఃశాఖల నన్నిటి వేరు వేరుగా నిరూపించిరిగాని అందు
కమ్మవారిని నిరూపించలేదు ద్విజులలోను జేర్చలేదందురా? ద్విజుల
లోగల అంతఃశాఖల నిరూపించలేదు కాన వీరిని ఉదాహరింపలేదు
శూద్రులలోగల అంత్యశాఖల నిరూపించుచు వీరిని నిరూపించక
పోవుటచేత శూద్రులుగారని యాగ్రంథకర్తలే సిద్ధాంతము జేసి
నటుల దృఢమగుచున్నది. మఱియు శూద్రులలో (1) సచ్ఛూద్రులు?
(2) శూద్రులు? (3) అంత్య శూద్రులనియు మూడు విధములుగా
నాగ్రంథములలోని రూపించుచు నామూడు విధములలో సచ్ఛూ
ద్రులు మిన్న లనియు సచ్ఛూద్రా గోపనాపితౌ, అనగా మంగలి గొల్ల
సచ్ఛూద్రులనియు జెప్పిరి కావున శూద్రవర్ణములలోకెల్ల మిన్నలగు మం
గలి, గొల్ల, వారలకన్న నధికులుగా నెంచబడు వీరు శూద్రులుగారనియెం
తటి మందమతియైనను తలచకపోడు. పూర్వపు గ్రంథము లిటుల నిరూ
పణజేసియున్నను, వైదికము వృద్ధియైనదాఁక వీరినిగురించి చతుర్థాన్వ
యులనియు, చతుర్థకోటియనియు, శ్రీహరిపాద పద్మములందు గంగ
వసై దోషులై బుట్టిరనియు నిగూఢవచనంబులు గ్రంథాదులందు బ్రయో
గింపమొదలిడిరి. ఇప్పుడిప్పుడు శూద్రులనుటకు సాహసించి యిటీవల
నచ్చువేయు వ్యాకరణాదులలో 'కమ్మ' శూద్రులలో భేదమని కల్పించి
గ్రంథములలో నిరికించుచున్నారు. గ్రంథావలోకనచే పూర్వమే
వర్ణమనక పోవడము నపుడు వైదికమతము లేకపోవడముచే ననియు
మధ్య నిగూఢవచనములు ప్రయోగించుట అప్పటివారికి వీరు శూద్రు

ఋగారని యెఱిగియుండి వీరుపనయనాది క్రియాలోపముగ నుండుట చేత వీరి కా నిగూఢవచనములు ప్రయోగించిరనియు, యిటీవల వీర యదంతెయెందున లేకున్న—యా నిగూఢవచనముల సహాయంబునను, వీరాచరించు క్రియాలోపములచేతను వీరిని శూద్రు లనుచుండి రనియు విదితమగుచున్నది. ఈ విషయము లటుంచుదు. వైదికమత గ్రంథములలో శూద్రునకు సేవకావృత్తి యే జీవనమనియు ద్విజశుశ్రూష జేయవలయుననియు నియమములు జెప్పియున్నవిగదా! ఆ నియమములు శూద్రులలో కెల్ల మిన్నయగు మంగలి దగ్గఱనుండి తక్కుంగల జాతులకడ కొంచముగనో. గొప్పగనో నున్నవిగాని ఒకప్పుడు గాక పోయినను, మఱి యొకప్పుడైనా యా నియమము లీ కమ్మవారి యందు లేని కారణమేమని యోచింప వీరు శూద్రులు గారనియు అందుచే యా నియమములు వీరిదరి చేరలేక పోయెననియు యంత రాత్మ బోధించుచున్నది. తిలకింపుడు. అశౌచవిధి ననుసరించి విచారింప 'మాసశూద్ర స్యకీర్తితః' అని శూద్రునకు నెలదినము లశౌచ విధి చెప్పియున్నది. ఈ కమ్మవారు పదునైదు దినములే అశౌచ విధి జరుపుటచేత శూద్రు లనరాదు ఇంత యేల? 'న శూద్రరాజ్యేనివసేత్', అని శాస్త్రవచనము లున్నవిగదా! ఈ కమ్మవారు శూద్రులైన వీరు కిరీటాధిపతులై పరిపాలించిన రాజ్యమున బ్రాహ్మణు లెట్లు నివసించిరి. వారిచే నగ్రహారముల నేటుబొందిరి. రాజాధిరాజా, మహారాజాయని స్తోత్రము లెట్లు జేసిరి? ఈ విషయములన్నియు నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించినవారికి కమ్మవారుశూద్రులుగారని తోపకపోదు. అట్లు జూడక వాదించువారికి వందనము లర్పించెదగాక! నేను వివరింపజాల



నని చెప్పి విరమించెను. అంతట శ్రీయుత దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారు లేచి యిట్లుపన్యసించిరి.

### శ్రీయుత దుగ్గిరాల రాఘవచంద్రయ్య చౌదరిగారి

### ఉపన్యాసము.

సోదరులారా!

రాజకీయ వాతావరణముతో దేశీయసోదరు లల్లకల్లోలమగుచుండగా నిరార్థిద్ధని కలహములతో నంతఃకలహాగ్నిని ప్రజ్వలింపజేయుట భావ్యముగాదు. ప్రస్తుత కాలమున వర్ణవిచక్షణ జేయుటకు (యాలక్షణములు నశించియుండుటచే) వలనుగాదు. ఇందులకు నిదర్శనము జూపెద. ఈసభలో సద్బ్రాహ్మణులున్నారా! యను విషయముపై శ్రీయుత మల్లాది రామకృష్ణ చైనులుగారికిని, వారికిని యాక్రింది సంభాషణ జరిగినది.

మ:రా: ఏమి! ఇచ్చట సద్బ్రాహ్మణులు లేరా?

దు:రా: ఉన్న చూపింపుడు.

మ:రా: భాగవతుల సూర్యనారాయణావధానులుగారు, నేను, (యిప్పుడు పేరు మఱచితి) యింకా కొంతమందిగలరని వారిని జూపిరి.

దు:రా: మీరు ముగ్గురినే జూపిరి. మిగతావారు లేరా? అనువరకు మేము బ్రాహ్మణులము గామా యను వాక్యములతో వాక్కలహము చెలరేగెను. అంత సభ చాలింపబడెను.

## ద్వితీయ దినచర్య:—

రెండవ దినము శ్రీపుష్పగిరి పీఠమువారి తరఫున శ్రీయుత మల్లాది రామకృష్ణ చైనులుగారు లేచి బ్రాహ్మణులందరు నొక వైపున, బ్రాహ్మణేతరులందరు మఱియొక వైపునఁ గూర్చుండినంగాని నే నుపన్యసింపను. బ్రాహ్మణేతరుల మధ్యకు నేను రానన‌గా సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారు ఈగ్రామములో బ్రాహ్మణేతరులమధ్య బ్రాహ్మణులు కాపురము జేయుచుండగా మధ్యనుండి యుపన్యసించ ననుట చెల్లదని చెప్పగా నెట్టకేలకు తప్పనిసరియగుటచే నుపన్యసించిరి. ఆయుపన్యాసములోని ముఖ్య విషయముల సారాంశము మాత్రము చిక్కినందున నిట పొందుపరచెద.

1. గుణకర్మలచేత వర్ణవిభాగంబైన ధృతరాష్ట్రుఁడు విదురుని తత్త్వోపదేశము చేయుమని కోరగా. నేను శూద్రుఁడ. తత్త్వోపదేశము చేయ నర్హుఁడనని విదురుఁడు జెప్పనేల? తత్త్వోపదేశము జేయ సమర్థతగల విదురుఁడు శూద్రుఁడు గాదనుకొనవలసినదేగదా! పుట్టుకనుబట్టి వర్ణవిభాగంబగుటచేతనే. అతఁడు తత్త్వోపదేశము జేయ సమర్థతగలిగియుండియు తాను శూద్రుఁడననియు, తన కుపదేశింప నర్హతలేదనియు చెప్పుకొనినాఁడు.

2. ఋషభుని పుత్రులు కొందరును, రంతీదేవుని వంశజులు కొందరును అక్కాలమున తపోవిశేషముచే రక్తమాంసములు మార్చుకొనినందున బ్రాహ్మణులైరి. అట్టిమార్పులు ద్వాపరాంతమువఱకు నున్నవి. కలి ప్రవేశించిన తరువాత మార్పులు లేవు.



3. ద్రోణాచార్యులు, అశ్వత్థామ కురుక్షేత్ర సంగ్రామమున నస్త్రశస్త్రములతో కయ్యమొనరించియు వారు బ్రాహ్మణులుగానే పరిగణింపఁబడుట జూడ పుట్టుకనుబట్టి వర్ణవిభాగంబని తేలుచున్నది. అట్లుగాదేని క్షత్రియ వృత్తియగు యుద్ధమొనర్చిన వారు క్షత్రియులు గావలసినదేగదా!

4. 'నచర్మణో నరక్తస్య' అను వాక్యము నిరాలంబోపనిషత్ బ్రహ్మజ్ఞానమును బోధించుటకు చెప్పుచున్నదిగాని వర్ణవిభాగంబును నిరూపించుటకుగాదు, ఇట్టిబ్రహ్మజ్ఞానమును ధర్మవ్యాధుఁడగు చండాలుఁడు బ్రాహ్మణులకు సైతము జెప్పియున్నాఁడు.

5. కర్ణుని బెంచిన సత్యకర్ముఁ డనులోమశూద్రుఁడుగాన కర్ణుఁడు శూద్రుఁడుగా వ్యవహరింపఁబడినాఁడు.

6. కృపుని బెంచిన దెవరోగాని కృపుఁడు బ్రాహ్మణుఁడు.

7. రాజ్యముల పరిపాలించిన వాసిరెడ్డి వంశీయులు కమ్మవారే గదా! వారనేక గ్రంథములకు కృతులు పొందినారు. ఆగ్రంథములలో వారు శూద్రులను సూచనగా విష్ణుపాదోద్భవులని వక్కాణించినారు గాన కమ్మవారు శూద్రులు.

8. కూర్మ శబ్దము కురమగా వచ్చునుగాని కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ గాదు.

9. కాకతీయులు శూద్రులని వారి శాసనములే జెప్పుచున్నవి గాన కాకతీయులు శూద్రులు.

10 బుద్ధాం వగైరా గ్రామములలో క్షత్రియులని వ్యవహ బడువారు క్షత్రియులు.

11. అమ్మరాజ విజయాదిత్యుని నూతన తామ్ర శాసనమున కమ్మ కులజుడని చెప్పబడిన దేవనయ్య కరణ కమ్మ వాడై యుండును. లేదా ఆరువేల కమ్మెలను శాఖవా యుండ వచ్చును.

12. కమ్మవారికి రాజు యను ఉపనామము లేదు గాన క్షత్రియు గారు. అని చెప్పి వారి యుపన్యాసమును జాలించిరి. సభ విరమింపబడెను. మరు దినమున యథా ప్రకా సభ గూడిన పిమ్మట చర్చ ప్రారంభింపబడెను.

## తృతీయ దినచర్య :—

సూర్యదేవర రాఘవయ్య చౌదరి ఉపన్యాసము.

1. పూర్వము ధృతరాష్ట్రుడు విదురుని తత్వోపదేశము చే మని కోరగా నావిదురుడు నేను శూద్రుడ తత్వోపదేశము జేయ ననర్హుడనని చెప్పినటుల మన చైనులుగారే చె మరల ధర్మవ్యాధుడను చండాలుడు బ్రాహ్మణులకు తత్వో దేశము జేసినటులు చెప్పినారు. తత్వోపదేశము జేయ శూ ద్రుడు కర్హత లేనపుడు చండాలున కెటులగ్గలైనో విచారింపు అందు విదురుడా వాక్యము జెప్పినటుల శూద్రుల నరిక గల్పించిన వాక్యమని యీవాక్యద్వయంబుచే బోధయగు చున్నది గమనింపుడు.



2. ఋషభుని పుత్రులు, రంతీదేవుని వంశజులు బ్రాహ్మణులైనది నిజమని యొప్పుకొనుచు వారు తపశ్శక్తిచే రక్తమాంసములు మార్చుకొని బ్రాహ్మణులైరనియు, నయ్యది గుణ కర్మలచే వర్ణవిభాగము గాదనియు, చైనులుగారు చెప్పుచున్నారు. ఇందలి సత్యమును సభికులు పరిశీలింతురుగాక ! పుట్టుకచే వర్ణవిభాగంబైనపుడు ఏవర్ణమందు బుట్టిరో యావర్ణమే బొందుననుట. గుణ కర్మలచే వర్ణవిభాగంబను నపుడు ఏవర్ణమం దుద్భవించినను తన గుణ కర్మల కనువగు వర్ణమును బొందు ననుట. ఇట చంద్రవంశపు క్షత్రియులు తాము జనించిన వర్ణమును విడిచి వేరు వర్ణమును బొందిరి గనుక గుణ కర్మలచే వర్ణవిభాగంబని సిద్ధాంతంబగుచున్నది. రక్త మాంసములు మారనిది గుణములు మారవనియు, గుణములు మారనిది కర్మలు మారవనియు, వైద్య వేత్తలెరుంగుదురు.

3. ద్రోణాచార్య అశ్వద్ధాములు సంగ్రామమున పాల్గొనుట దప్ప నితర వృత్తులన్నియు బ్రాహ్మణ వర్ణముననుసరించి యుండుట చేత బ్రాహ్మణులుగా బరిగణింపబడిరి. ఆయుద్ధము జేయుట పోషకుల యాజ్ఞానుసారముగాన నయ్యది వర్ణవిచక్షణ కాటంకము గలిగింపలేక పోయెను.

4. రక్తమాంసాదులకు జాతిలేదు. జాతియనడము వ్యవహారమునకు కల్పితమను నిరాలంబోపనిషత్ యొక్క బ్రహ్మజ్ఞానము ముఖ్యముగాని ఇతర యజ్ఞానము ముఖ్యముగాదు.

5. కర్ణుని బెంచిన దనులోమ శూద్రుఁడుగాఁడు. ఇందును గురించి భాగవత నవమస్కంధమున నీవిధమున చెప్పఁబడియున్నది:

వ॥ (1) అరోమ పాదునకు జతురంగుఁడును, (2) జతురంగునకు బృథలాక్షుండును, (3) బృథలాక్షునికి బృహద్రథుండును, బృహత్కర్మ్మండును, బృహద్భానుండు ననుమువ్వురు బుట్టిరి. అందు (4) బృహద్రథునకు బృహన్మనసుండు (5) బృహన్మనసునకు జయద్రథుండు (6) జయద్రథునకు విజయుండు, (7) విజయునకు సంభూతియను భార్యయందు ధృతియు, (8) ధృతికి దృఢవంతుడును, (9) దృఢవ్రతునకు సత్యకర్మ్మండు, (10) సత్యకర్మ్మునకు నతిరథుండు జనించెను.

ఆ॥ కుంతిపిన్ననాడు. గోరి సూర్యునిబొంద। బిడ్డదుదితుడైన బెట్టనెత్తి గంగనీటవిడువగని యతిరథుఁడంత। గర్ణుఁడనుచునతని గారవించె.

భాగవతము నవమస్కంధము 711 పేజీ

ఈప్రమాణమునుబట్టి కర్ణుని బెంచిన యతిరథుండు శాంతనునకుంచి ఋష్యశృంగునకిచ్చిన రోమపాదునకు పదియవ తరమువాడు. చంద్రవంశపు క్షత్రియుఁడని చేట తెల్లంబగుచుండ ననులోమసంకరుఁడని చైనులుగారెట్లు జెప్పిరో తెలియకున్నది.

6. కృపుని బెంచిన దేవరో చైనులుగారికి దెలియదట. నేను వివరించెదఁ బరీక్షింపుడు. భాగవతము 9వ స్కంధములోగల చంద్రవంశానుక్రమణిక యందు:–

కం॥ చపలరతిశంతనుండను। నృపవరుఁడడవికిని వేటనెపమున
జనుచున్ । గృపతో శిశుయుగమున్ గని।గృపియుఁగృపుఁ
డనుచు దెచ్చి గృహమునఁ బెంచెన్॥



వ॥ ఆకృపి ద్రోణునకు భార్యయయ్యె..................కృపుని బెంచినది శంతనుఁడను చంద్రవంశపు క్షత్రియుఁడు. సత్యాన్వేషణపరులీ కర్ణకృపుల జన్మకథ ననుసరించి వర్ణవిభాగచట్టమును సిద్ధాంతము జేయుదురుగాక! చంద్రవంశపు క్షత్రియుఁడగు నతిరథుండు జేజాతిసంభవుడైనది తెలియని శిశువును గంగలోనుంచి తెచ్చి పెంచుకొనగా నాశిశువు యుక్తవయస్సువచ్చినతరువాత శూద్రుఁడని వ్యవహరింపఁబడుటయు నాచంద్రవంశపు క్షత్రియుఁడగు శంతనుఁడేజాతి సంభవులైనది తెలియని శిశుద్వయమును నడవిలోనుంచి తెచ్చి పెంచుకొనగా వారు పెద్దవారలైనతరువాత బ్రాహ్మణులుగా వ్యవహరింపఁబడుటయు జూడ గుణకర్మ్మములచే వర్ణవిభాగంబని ఎంతటి మందమతికైనను విశదము గాకపోదు.

7. సంస్కృతమును జదివిన వాసిరెడ్డివంశీయులు విష్ణుపాదోద్భవులమని యంగీకరించుట వారు వైష్ణవమతాభిమానులగుటచేతను, విష్ణుభక్తులను సూచన యావాక్యమునందుండుటచేతను యావాక్యము నంగీకరించుట గల్గినది. విష్ణుపాదోద్భవులనగా విష్ణుపాదములందు బుట్టిరనునెడల నటులబుట్టుట సృష్ట్యారంభమునఁనా ? పిమ్మటనా? సృష్ట్యారంభమున నైనచో నప్పటినుండి కమ్మవారను శాఖప్రచారములోలేని కారణమేమి?తదుపరిమైన నందుకు ప్రమాణమేది ? సృష్టికర్తలు బ్రహ్మయని చెప్పెదరు గదా ! ఇంతయేల ? కమ్మవారు శూద్రులగుటచేతనే యావాక్యమును ప్రయోగించినటులైన నవ్విధినివలుతావుల బ్రయోగించిన వారందరు ద్వంద్వార్థమగు నాపదమునే ఏలప్రయోగిం

వనలె? ఒక్కచోటనైనను శూద్రులని నలప్రయోగింపలేదు? ఈవిషయంబులఁ బరిశీలింప నావాక్యమును బ్రయోగించినవారు శూద్రులని వ్రాయజాలకను, క్షత్రియులనియును మనసొప్పకను యీఉభయుక్తపదమును వ్రాసిరి. అటులగాదేని కమ్మవారు శూద్రులని యిప్పటి పండితులెరిగియున్న శూద్రులువేదమువిననర్హతలేదను చట్టముననుసరించి యీకమ్మవారు కిరీటాధిపతులగుట కెట్లొప్పుకొనిరి? అద్వంద్వార్థములు క్రీ॥శ॥10వశతాబ్దమునకు పూర్వము ప్రయోగింపఁబడక యిటీవల బ్రయోగింపఁబడుటయు, 16వ శతాబ్దమున కిటీవల ద్వంద్వార్థములకు మారుగా శూద్రియనువాక్యములఁ జేర్చుటయుఁగలుగుచున్నది. అయ్యది నాయుపన్యాసమున వివరించిన చందమున పరిణామము జెందెననుటధ్రువము. క్రీ॥ శ॥ 10వ శతాబ్దమునకు పూర్వపుచరిత్రనుబట్టి ప్రతిపక్షులు జేయు. ఋజువు నంగీకరింపవచ్చునుగాని ఇటీవల కల్పితపువ్రాతలనుబట్టి చేయువాదనను మాత్రమంగీకరింప జాలము.

8. కమ్మలుబ్రాసి పండితులను పిలిపించుటచే కమ్మవారైరనుటకంతకు పూర్వ మేవర్ణజులు? శూద్రులేనా? అటులైన శూద్రుని యాజ్ఞను బ్రాహ్మణుఁడు శిరసావహించి చేయవచ్చునా? అయ్యదియే గాబోలు బ్రాహ్మణ శుశ్రూష.

9. కూర్మశబ్దము కమ్మగాక ఖరమైనను, కుమ్మరైనను బాధలేదు. శబ్దార్థములకేమి! విప్రశబ్దము వుప్పరగా మారవచ్చును. వర్ణవిభాగము శబ్దార్థముల ననుసరించిగాదు.



10. కాకతీయులు శూద్రులని చెప్పుచు బుద్ధాం వగైరా గ్రామములలో నివసించు రాజులమని చెప్పుకొనువారు క్షత్రియులని చెప్పినారు. రాజులమని చెప్పుకొనువారిలో మందపాటివారు కాకతీయుల వంశజులే. కాకతీయులు శూద్రులైన మందపాటివారు శూద్రులే. మందపాటివారు క్షత్రియులైన కాకతీయులు శూద్రులుగారు ఒక వంశములో ప్రథములు శూద్రులైన తరువాత వారు శూద్రులు గావలసినదేగదా!

11. కాకతీయులు వర్మశబ్దమును మధ్య దెచ్చిపెట్టుకొనిరిగాన శూద్రులనుచున్నారు. వారు క్రీ॥ శ॥ 10వ శతాబ్దమునకు పూర్వము జైన మతావలంబకులై యున్నందున వైదిక మతచిహ్నములగు వర్మ శబ్దములు లేక పోయినను క్షత్రియులని చెప్పు తత్పూర్వ శాసనమును కమ్మవారి చరిత్రమునం దుదాహరించితి. దానిని బట్టి కాకతీయుల క్షత్రియత్వము వెల్లడియగుచున్నది. పెక్కేల కాకతీయ వంశజులగు మందపాటివారు నేఁడు సూర్యవంశపు క్షత్రియులుగా వ్యవహరింపఁబడుటచే కాకతీయులు క్షత్రియులని నిరూపణయగుచున్నది. దుర్జయకులాభరణులమని చెప్పుకొన్న కమ్మవారు క్షత్రియులనుట కాటంకమేమియు లేదు.

12. అమ్మరాజ విజయవర్ధనుని నూతన తామ్ర శాసనములోని 'కమ్మకులజః' అను వాక్యమునకు మన పైనులుగారు కాళిదాసు కవిత్వము కొంత సాహిత్యము కొంత యనునట్లు కరణకమ్మ లేక నాలుగువేల కమ్మలు యను నర్థము చెప్పుచున్నారు. కరణ

కమ్మలు, ఆరువేల కమ్మెలను శాఖద్వయము బ్రాహ్మణ వర్ణములోని యంతః శాఖలనుచున్నారు. అయ్యది నిజమగునేని నేఁడు వ్యవహారమందున్న కమ్మశాఖను కరణ కమ్మ శాఖయని గాని యారువేల కమ్మెల శాఖయనిగాని చెప్పవచ్చునా! ఆవాక్యములోని యర్థమదిగాదు. 'కమ్మకులజః' అనగా కమ్మ కులమందు బుట్టినవాఁడను నర్థమని పశువుల కాపరియైనను గ్రహింపకపోఁడు.

13. కమ్మవారికి రాజను యుపనామము లేదుగాన శూద్రు లనుచున్నారు. కోటకేతరాజు, బుద్ధరాజు కమ్మవారని నా ప్రథమోపన్యాసమునఁ జెప్పఁబడినది వినియు కమ్మవారికి రాజను యుపనామము లేదనుట పొరపాటు. నాయుఁడు, నీఁడు, చౌదరి, కావు, రెడ్డి మున్నగు యుపనామములు క్షత్రియ స్వరూపమును వెల్లడి జేయుచున్నవి. నియోగులలో రాజను యుపనామమున్నవారు క్షత్రియులేనా? బ్రాహ్మణులలో రావను యుపనామము గలవారు వెలమ వారేనా?

పిమ్మట శ్రీమత్పరమహంస స్వామి జి.యస్.బి.సరస్వతిగారు లేచి పుష్పగిరివారు ధరించిన బిరుదావళుల యర్థమును వివరించి చెప్పుచు నాయర్థమునుబట్టి పీఠము శ్రీశంకరాచార్యుని స్థాపితముగాదనియు నందువలన నీపీఠమున కీవాదన సారాంశమును జెప్ప నర్హత లేదనియు, కూర్మశబ్దము క్షత్రియ వాచకమనియు, కమ్మవారు మున్నగువారు క్షత్రియులనియు, వారిని శూద్రులని చెప్పిమాయజేయు కాలముగతించినదనియు నామాయను విడచినగాని బ్రాహ్మణులు తొల్లిటి గౌరవ



...లను బొందజాలరనియు నుపన్యసించిరి. అటువెన్క— మ॥ రా॥ రా॥ ..., బారిష్టర్ త్రిపురనేని రామస్వామి చౌదరి శతావధానిగారు లేచి ...మ్మవారు క్షత్రియులని యనేక ప్రమాణములతో నుపన్యసించిరి. అం...నాటికి సభ చాలింపఁబడెను.

## ...తుర్థ దినచర్య:—

శ్రీయుత మల్లాది రామకృష్ణ చైనులుగారు లేచి శ్రీపుష్పగిరి ...ము శ్రీశంకరాచార్యులు స్థాపించినదని చెప్పబోవుచుండగా వారి ... సూర్యదేవర రాఘవయ్యచౌదరి, త్రిపునేని రామస్వామి చౌదరి ...ర్లకీ క్రిందిసంభాషణ జరిగినది.

...॥ రా॥ మనము మూఁడుదినములు సభచేసి చర్చించుకొనుటకు నిర్ణయించుకొంటిమి. కాని నాల్గవరోజు జరుగుచున్నది. ఇపుడసలు విషయమును విడచి పీఠచరిత్రకు వాదనదిగినది. ఇటుల జరిగిన యీవాదన యింకెన్నిదినములకు తేలునో తెలియదు. మాతరఫునవచ్చిన యతిధివర్యులు మూఁడు దినములు సభయని వచ్చిరి వారినింకెన్ని దినములుండుఁడని కోరవలయునో ముందునిర్ణయించవలెను.

...రా॥ మాపీఠమునుగురించి మీతరఫున వచ్చినవారు విమర్శించినపుడా విమర్శనను మేము చర్చింపవలసినదే గదా!

...రా॥ మీరును చర్చింపవలసినదేగానియసలు మనవాదన ఎంత కాలమునకు తేల్చుకొనుటో ముందు నిర్ణయింపవలెను.

మ॥ రా॥ కమ్మవారి చరిత్రమునుగురించి సిద్ధాంతమును జేయుట
ముందన్ని పీఠములవారికిని వ్రాసికనుగొనిగాని సిద్ధాంతః
జేయవీలులేదు.

సూ॥ రా॥ అన్నిపీఠములనుండియు జవాబువచ్చువరకు నీసభజరు
చుండ వలసిన దేనా ?

పీ॥ దివాను. అవసరములేదు. సభనికచాలించి మేమన్నిపీఠములవా
కిని వ్రాసికనుగొని మీకు దెల్పెదము.

సూ॥ రా॥ ఇపుడన్నిపీఠములకు వ్రాయవలసిన కారణమేమి గలిగిన
ఇందుజరిగినచర్చనుబట్టి మీయభిప్రాయమును దెల్పెదరా ?

పీ॥ దివాను. మీవాదనను మేమొక్కరమే యంగీకరించుటకన్న
అన్నిపీఠముల వారికి వ్రాసి వారందరితో నేకీభవించి యొః
కొనుటచే మన యుభయులకు మంచిదే.

త్రి॥ రా॥ ఇతర పీఠముల యభిప్రాయములను దీసికొని ఎంతకాలమ
నకు దెల్పెదరు.

పీ॥ దివాను:- నాల్గయిదు మాసములు వ్యవధి గావలయును.

సూ॥ రా॥ నాలుగైదు మాసములకు మీ రేదేనమేగెదరో? ఆగను
నకు మావాదన నొప్పుకొనుటో లేక వేరు మార్గమును నిరు
పించుటో చేయ నపుడేమిగావలె?

పీ॥ దివాను: అయిదు మాసములకు మీకు తగు జవాబు రాని యెడ
మీవాదన కొప్పుకొనినటుల మీరే ప్రచురించు కొనవచ్చును

త్రి॥ రా॥ అట్లయిన మీపీఠపు చరిత్రముతో మాకు పనిలేదు ?



మేము వెళ్లుచున్నాము.

॥ దివాను: మంచిది.

అంతట సభసమాప్తి జేయబడినది. పీఠమువారు సభలో జరిగిన
చర్చపై విధముననుండ నీదిగువ నుదహరించిన చందమున సభలోచర్చ
జరిగెనని యొక పుస్తకము నచ్చొత్తించి తమ కనుకూలురగు వారికి
సంగూఢముగా బంచిపెట్టుచున్నారు.—

ఉభయవాద సంగ్రహము.

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శంకరో విజయతే.

# బ్రాహ్మణేతర విజయము.

కల్పితోభయవాద సంగ్రహము.

సీ॥ జన్నంపు మిషచేత • జంతుహింస నొనర్చి
పాకయాజులమంచు • దూకువారు
తప్పుడుసాక్ష్యముల్ • జెప్పిలంచంబుల
మెక్కి వైదికులమంచు • నిక్కువారు
సంధ్యముక్కలునాల్గు • స్మరియించుటే మాని
జగతీసురులమంచు • నెగురువారు
వెలయాంధ్రదేశమంగిలి • విడియమ్ములన్ మ్రింగి
యాచార్యులమటంచు • నటచువారు

గీ॥ కాపువారును, రెడ్డివార్, • కమ్మవారు
వెలమవారు, సంకరులంచు • బలికినారు
జ్ఞప్తిలేదొక్క బ్రాహ్మణ • జన్మకథలు
సరసమతులార చౌదరి • సభ్యులార

బాలకవి కొసరాజు రాఘవయ్య చౌదరి.

అత్రభవతాం వేదశాస్త్ర సంపన్నానాం ధర్మస్థాపన బద్ధాదరణాం.

శ్రీయుతాం.........................................మహాశయానాం.

సవిధంప్రతి......................................

ఆంధ్రదేశవర్తినః శ్రీజగద్గురు పుష్పగిరి శంకరమఠస్యాస్థాన పండితః మల్లాది రామకృష్ణశాస్త్రి మహాగ్నిచిత్ సవినయం విజ్ఞాపయతి.

అస్మాంధ్రదేశస్యాచార వ్యవహారవ్యవస్థాపన, మస్మత్సంస్థానాధీనంవర్తతే కలివశాత్ క్వచిత్ వ్యతిక్రమోపి దృశ్యతేసత్తద్దేశే చిరకాలాదారభ్య కమ్మ, వెలమ, రెడ్డి, బలిజె, కాపు ఇత్యావాంతర భేదభిన్నాః ప్రజానివసంతి ఏతాశ్చనేకశాతవర్షేభ్యశ్శూద్రత్వేనైవ పరిగణ్యంతే. ఏతజ్జాతీయాః కేచనైతద్దేశపరిపాలకాః ప్రథవోప్యాసన్. ఇదానిమపిసంతి కేచి త్ప్రభవః ఏతేచదేవ బ్రాహ్మణభక్తాః పురాణోక్తత్తద్ధర్మానుష్టాయిన శ్శూద్రాచారాస్సంతోవర్తతే ఏతావత్పర్యంతమేతాషా మన్యేషాంవా శూద్రాచారేన కాచన్ విప్రతిపత్తిః ఏవం స్థితే జి. యస్. బి. సరస్వతి సంజ్ఞకఃకశ్చిద్యతిః ఏతే కమ్మ, వెలమ ప్రభృతయః ప్రజాపాలన రూపక్షత్రధర్మవత్వాన్ క్షత్రియాః గుణకర్మవశాదేవ జాతిర్నిష్పద్యతే. అతియేవబుషభపుత్రాః ప్రజాపాలన రూపక్షత్రధర్మయోగా నవక్షత్రియాః అథర్వణ యజ్ఞతంత్ర ప్రవర్తకత్వాదేకాశీతి బ్రాహ్మణా అభవన్ ఇదంచోపాఖ్యానాం శ్రీభాగవతాదా ప్రసిద్ధం ఇత్యాదికం బోధయన్ ఆంగ్లపండిత సంగృహీత చారిత్రవశాదేతత్పూర్వ పురుషాః "క్షత్రియా" ఇతినిర్దిశన్ ఏతేషాం యజ్ఞోపవీతధారణోపనయనాదికం వైదికేనైవవిధినా బ్రాహ్మణ నిర్విశేషం శూద్రైః పురోహితైః కారయన్నస్మ శ్రాద్ధాదికంచ కారయన్ బ్రాహ్మణేష్వేతేషాం ద్వేషముద్దీపయన్నాస్తే ఏతజ్జాతీయస్తదనుయా



యినో దేశమాతులీకుర్వతి మద్రాస్ యిలాఖా గుంటూరుజిల్లా తెనాలితాలూకాంతర్వర్తిని కొల్లూరునామకేగ్రామే అస్మత్స్వామిభిరేతత్సం వత్సరచాతుర్మాస్యవ్రతం నిర్వర్త్యతే. అత్రత్యాః కేచనకమ్మజాతీయాః వయం చాతుర్వర్ణ్యేక్షత్రాంతర్భూతాః ?

యథాశాస్త్రంవిచార్య ప్రత్యుత్తరం దేయ మిత్యస్మత్స్వామి నాంసవిధే విజ్ఞాపనపత్రం సమర్పయంతిస్మ తస్మాదవశ్య మస్మాభిర్మహాజన సమ్మత్యాప్రత్యుత్తరం దాతవ్య మిత్యస్మత్స్వామినో దేశాంతరస్థానామపివిదుషాం శిష్టాగ్రగణ్యానా మభిప్రాయ పరిజ్ఞాన మపేక్షమాణ అస్మాన్ పత్రికాలేఖనా యాజ్ఞాపయన్. తదాజ్ఞామై. వేదం. పత్రం. లిఖితం.

## కమ్మజాతీయానాంవాదః.

1 గుణకర్మభ్యాం జాతిర్నిష్పద్యతే అతః ప్రజాపాలక వంశీయ వయంక్షత్రియాః అస్మజ్జాతీయాః మహారాష్ట్రదేశే కుంబీ ఇతి వ్యవహ్రియ్యంతే

2. ఆర్యావర్తేచాడరీతిచ క్షత్రకులవినాశిన్యాం కస్యాంచిదాపది యజ్ఞోపవీతవైదికకర్మత్యాగినో వయాచిరాత్ప్రభృతి. శూద్రత్వేనైవపరి గణితాః. ఇదంచపరిగణనం బ్రాహ్మణైః రస్మదుపరి అనాదరేణైవకృతం.

3. ఇదానీం ప్రాయశ్చిత్తపూర్వకం ఉపనయన వేదాధ్యయనాదికం కరిష్యామః.

4. సహస్రవత్సరేభ్యః పూర్వంవయంక్షత్రియా ఇత్యర్థాః స్వపూర్వపురుషైః విరచితానినిర్మితాని కాని చిచ్ఛిలాశాసనాని ప్రమాణాని సంతి ఇత్యాదికః.

## బ్రాహ్మణవాదస్తు.

1. ఉత్పత్త్యైవ జాతిర్నిష్పద్యతే బ్రాహ్మణోస్య ముఖమాసీదిత్యాదిశ్రుతయః సవర్ణేభ్యస్సవర్ణాసు జాయంతే సజాతయః ఇత్యాదిస్మృతయః విదురస్య శమదమాది సంపన్నత్వేపి శూద్రయోన్యుత్పన్నత్వేన శూద్రత్వేన మహాభారతే కీర్తనం ఆనుశాసనిక పర్వాన్తర్గత మతంగోపాఖ్యానాదికం చాత్రప్రమాణం పూర్వకేషాం చిత్తు క్షత్రియాణాం తస్మిన్నేవజన్మని బ్రహ్మణ్య సంపాదక తపోవిశేషా ఆసన్ అత్యేవ ఋషభపుత్రైః బ్రాహ్మణ్యం లబ్ధం కలౌతున తథాస్త్యవకాశః తాదృశానా మహాదృష్టశ్రుత పూర్వత్వాత్।

2. ఇతరేషాం పరిగణనేనసకదాచి దపిజాతి రూపైత్వాపైతినా బ్రాహ్మణానామపి కశ్యచిత్ సంఘస్యోపరి అనాదరణే కారణం నోప లభ్యతే అభ్యుపగమవాదేన తేషాంక్షత్రియత్వాంగీకరేపి గోత్రసూత్ర వేద ప్రత్యభిజ్ఞాభావా దుపనయన వైదికకర్మాచారణాదికం ధర్మ విరుద్ధమేవ తాదృశప్రాయశ్చిత్తాది బోధకగ్రంథాభావాత్.

4. తత్ప్రతిపాదితాని శిలాశాసనాని తత్కాలీనానాం క్షత్రియత్వ మవగమయంతు ఇనానీంతదానాం తద్వంశత్వంతు సందిగ్ధం ఇత్యాదికః.

అతోధర్మత్రాణ పరాయణ భవంతః ఏతత్పత్రికావలోకన ప్రభృతి పంచదశదినేభ్యో ర్వాగేవవాదద్వయం సమ్యగ్విమృశ్యకోవా పక్షో భవ దభిమతః యుష్మద్దేశే కుంబీ "చౌదరీ" సంజ్ఞకాః ప్రజాస్సంతిదా నంతిచేత్తాః కస్యాంజాతౌ పరిగణ్యాంతే ఇత్యాదికం సానుగ్రహం సప్రమాణం లేఖనీయమిత్యభ్యర్థయామః.

ఇత్యేవం విజ్ఞాపయితా,

(నాగరలిపి) మల్లాది రామకృష్ణశాస్త్రీ,

మహాగ్నిచిత్.



## కమ్మవారివాదము.

1. గుణ కర్మలనుబట్టియే జాతియేర్పడెను:- గనుకనే ఋషభుని కుమారులు తొమ్మండ్రు నవద్వీపపతులగుచు క్షత్రియులైరి. ఎనుబది యొకరు యజ్ఞతంత్ర ప్రవర్తకులగుచు బ్రాహ్మణులైరి. విశ్వామిత్రుడును ఈవిధముననే బ్రాహ్మణుడాయెను. ఈకథ శ్రీభాగవతవిష్ణు పురాణాదులలో ప్రసిద్ధము. మాపూర్వులు ప్రజాపాలన రూపక్షత్ర ధర్మముతో వర్తించిరి. గనుక క్షత్రియులు. తద్వంశ్యులమగు మేమం దరము క్షత్రియులము.

2. కూర్మముపదధాతి:-ఇత్యాది స్థలములందు వేదమున కూర్మశబ్దము వాడబడినది. సహ్యాద్రిఖండమందు కూర్ముడని యొక ఋషియు, రాజును కలడని వాడబడినది. గృత్సమదుని కుమారుడు కూర్ముడను నొకఋషి కలడని నిరుక్తమను గ్రంథమున చెప్పబడి నది. జయపురము మొదలగు కొన్ని సంస్థానముల రాజులు తమరు కూర్మకులావతంసులుగా చెప్పకొనుచున్నారు. కూర్మశబ్దము మహారాష్ట్ర భాషలోన 'కుంబీ' యని మారినది. ఆంధ్ర దేశమున కమ్మ యని మారినది. గాన మేమందరము కూర్ముడను రాజుయొక్క సంతతి వారలము. గనుక క్షత్రియులము. ఇటులనే 'రాట్' అను క్షత్రియ వాచకశబ్దము మారి రెడ్డియైనది. రెడ్లు అని పిలువంబడు వారును క్షత్రియులే. 'వర్మ' శబ్దముమారి వెలమయైనది. గనుక వారును క్షత్రియులే. 'బలవాన్' అను శబ్దము మారి బలిజెయైనది.

గనుక వారును క్షత్రియులే. 'కాంపిల్య' శబ్దము మారి కాపులైరి గనుక వారును క్షత్రియులే.

3. ఓరుగల్లుప్రభువగు కాకతీయగణపతి దేవుడును, ప్రతాప రుద్రుడును క్షత్రియులు తద్వంశ్యులని చెప్పుకొనెడి. మందపాటివారు మొదలగు వారలు క్షత్రియులని వాడఁబడుచున్నారు. తద్వంశ్యుల మగు మేము మాత్రము క్షత్రియులము కాకపోవుటకు కారణములు లేవు.

4. మేము శూద్రులమే యైనయెడల "నశూద్రరాజ్యే నివసేత్" అని శాస్త్రముండెనుగదా! మాచే పరిపాలింపబడు నీరాజ్యమందు పూర్వకాలపు బ్రాహ్మణు లెట్లు నివసించిరి? గాన మేము శూద్రులము కాము.

5. శూద్రునకు "మాసశ్శూద్రస్య కీర్తితః" అని నెలదినముల ఆశౌచము చెప్పఁబడినది. మేము శూద్రులమైనయెడల మాచేత నట్లాచరింపచేయుటలేదు. 15 దినములే మే మాచరించుచున్నాము. గనుక మేము శూద్రులము కాము.

6. సచ్ఛూద్రులు, అసచ్ఛూద్రులు, శూద్రులు అని మూఁడు తెగగుల శూద్రజాతి యుండినట్లు ధర్మశాస్త్రమువలన గన్పట్టుచున్నది. "సచ్ఛూద్రా గోపనాపితౌ" అని యున్నందున గొల్లలు, మంగలులు సచ్ఛూద్రులు. రజకాదులు, అసచ్ఛూద్రులు, సామాన్యులు, శూద్రులు మేమీ మూఁడు తరగతులలోను చేరియుండము కదా! ఇదిగాక మంగలులు మొదలగువారలు బ్రాహ్మణులకువలె మాకును పరిచారకత్వము చేయుచున్నవారలు. గనుక ప్రభుచిహ్నము



లగు నీడు, నాయుడు, చౌదరి యను బిరుదములతో వ్యవహరింపఁబడుచున్న మేము శూద్రులము కాము. క్షత్రియుల మనుటకు సంశయము లేదు.

7. "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం" అని శూద్రునకు పరిచర్య అనఁగా సేవచేయుట ధర్మముగా చెప్పఁబడినది. మాసంఘము వారెప్పుడు నెవ్వరికిని సేవచేయరు. ఇతరులచేతనే సేవచేయించుకొందురు. గనుక శూద్రులు కారు.

8. మాకు ఋషిగోత్రములు లేనందునను వొల్లుట్ల మొదలగు దేశభాషా గోత్రము లుండుటఁజేసియు మము శూద్రులందురేని అది యుక్తముగాదు. పూర్వులు యింతదూరము విచారించక అప్పుడు వారికి సంభవించిన రాజకీయవిపత్తులనుంచి వారు గోత్రముల మరచిరి. మేము ఋషిగోత్రముల నిప్పుడు యేర్పాటు చేసికొనుచున్నారము. గనుక గోత్రములు లేవనులోపము మాయందువర్తించదు. కమ్మవారల లోనను కొందరు భారద్వాజ గోత్రమువారలుండినట్లు అమరావతిలో నొక శాసనము కనుపడినది. గనుక నిదియొక యాక్షేపణముకాదు.

9. చిరకాలమునుండి, ఉపనయన వేదాధ్యయనాదులు లేని మీకిప్పుడు మీరుక్షత్రియులని యంగీకరించినను, ఉపనయన వేదాధ్యయ నాదులు సంభవించవందురేని యది యుక్తముగాదు. బ్రాహ్మణులలో కొన్నితరములనుండి యజ్ఞములు చేయనివారలు యజ్ఞముల నాచరింప దలచినప్పుడు యథాశక్తి ప్రాయశ్చిత్తముల చేసికొని యాచరించుచున్నారు. అటులనే మేమును మాశక్తికొలది ప్రాయశ్చిత్తము చేసికొని ఉపనయన వేదాధ్యయనములు చేయుచున్నాము. గనుక నిదియు నాక్షేపణముకాదు.

10. మీరు క్షత్రియులే నైన యెడల క్షత్రియులని వాడబడు పూసపాటివారు మొదలగు వారలు మిమ్ము క్షత్రియులుగా నంగీకరింతురా ? మీతో సంబంధ బాంధవ్యములకుగాని, భోజన పంక్తి భోజనాదులకుగాని వారంగీకరింతురా అని మమ్ము కొందరు ప్రశ్నింతురు. అది సరికాదు. వారికి మాసంఘములయందు ద్వేషముచే వారంగీకరించక పోవచ్చును. బ్రాహ్మణులలో వైష్ణవులు, మాధ్వులు, స్మార్తులు పరస్పర సిద్ధాంతముల నంగీకరించక పోయినను అందరు బ్రాహ్మణులనుటకు సంశయము లేదు. అటులనే ప్రసిద్ధక్షత్రియులకును, ప్రచ్ఛన్న క్షత్రియులకును సంబంధబాంధవపంక్తి భోజనాదులు లేక పోయినను అందరము క్షత్రియుల మనుటకు సంశయముండదు.

11. క్రీస్తుశకము 1000 అమ్మరాజవిజయాదిత్యుని కురువాడ శాసనము చిలుకూరు వీరభద్రరావుగారిచే ప్రకటింపబడినది. ఆశాసనమున, ఆసీచ్చిమురువాస్తవ్యో దేవర్యో దేవసన్నిభః, భరద్వాజాన్వయః కమ్మకులజః కులవర్ధనః, తస్యాభవత్సుతశ్శ్రీమాన్ గోవిందో గురువందనః, శ్రౌతస్మార్త క్రియాచార స్సత్తమస్తత్సమస్స ద్విజోత్తమః, తదాత్మజో దేవయ్య సద్విద్యో వద్యవర్జితః, అభూద్భవపదాంభోజ షట్పదః పదవాక్యవిత్, తస్మై భవద్విషయే మధ్యవర్తిని కురువాడగ్రామే ?' ఇత్యాది ఈశాసనమున కమ్మకులజః అనియు, భరద్వాజాన్వయః అనియు ద్విజోత్తమః అనియు చెప్పబడినది. గనుక పూర్వకాలమున కమ్మవారు బ్రాహ్మణులై యుండెడివారు.

ఇటులనే క్రీస్తుశకము 1011 అయిదవ పశ్చిమచాళుక్యవిజయాదిత్యుని ఆలూరు శాసనమున "విప్రకులకమలభాస్కరం, పార్వ



కొల్లండు సప్తగ్రామాగ్రగణ్యం కమ్మకులోద్భవం, ధీతగోత్రం, దిండిపండితపుత్రిం,, అని చెప్పబడినది. ఈశాసనములోను కమ్మవారు బ్రాహ్మణులనియే చెప్పబడినది.

క్రీస్తుశకము 673 చందవోలుశాసనము. సర్వలోకాశ్రయమహారాజః కమ్మరాష్ట్రే చందలూరుగ్రామే, గ్రామే యుకా నత్రగత సర్వనియోగికవల్లభాంశ్చా జ్ఞాపయతి. ఏషగ్రామోఽస్మాభిః, బ్రాహణేభ్యః ఛాందోగ్యేభ్యః, కౌండిన్యగోత్రేభ్యః, షట్కర్మనిరతేభ్యః సతతావిచ్ఛిన్న పంచమహాయజ్ఞక్రియేభ్యః కుటూరవాస్తవాస్తవ్యాయ, ద్వే అంశే వంగబోయాయద్వే కొల్లిపురోబోయాయ, పిచేనబోయాయ ద్వే, కురీముదబోయాయద్వే, కాళబవగోత్రాయ కోదింకిబోయాయ ద్వేఅంశే, ఏవమేతేభ్యః బ్రహ్మదేయ మర్యాదయా సర్వపరిహారోపేతో దేవభోగహాలవర్జం, ఆయుర్బల విజయాభివృద్ధయే సత్రతః ఈశాసనమున బోయబ్రాహ్మణు లున్నట్లు కన్పట్టుచున్నది. బోయలనగా చేపలుపట్టువారు వీరుకూడ బ్రాహ్మణులని శాసనము లుండగా కమ్మవారు క్షత్రియులని చెప్పుటకు సంశయముండదు.

12. ఇట్టి హేతువులచే క్షత్రియులమని నిశ్చయింపదగిన మేము దేవస్థాన తీర్థ ప్రసాదాది సమయములయందు వైశ్యులకంటె ప్రథమ గౌరవార్హులము. అట్టి గౌరవములే శ్రీవారి సంస్థానమందు మాకు జరుపవలెనని ప్రార్థించుచున్నాము.

13. శ్రీశంకరాచార్యులకు పూర్వకాలమున జనులందరు బౌద్ధులై యుండిరి. శ్రీశంకరులు గుణకర్మవిభాగముల బట్టియే తరువాత జాతుల నేర్పాటుచేసిరి. మొదలు హిందూమతములో చేరినవా

రలు జంధ్యముల ధరించి క్షత్రియులని వాడబడిరి. తరువాత కొంక
లమునకు హిందూమతములో చేరిన మాకు యజ్ఞోపవీతధారణ
కలుగలేదు. ఈమాత్రమున మాకు క్షత్రియత్వము లేకపోదు.

మాగృహములలో భట్రాజులు భోజనముచేయుదురు. వా
ఋషిగోత్రములు కలవు. వారు యజ్ఞోపవీతముల ధరింతురు. మా
యజ్ఞోపవీతములు లేకపోవుటకు కారణము గనుపించదు.

15. మీరు పూర్వక్షత్రియరాజుల సంతానమైనయెడల
రికిగల రాజశబ్దము మీకెందుకు లేదు. గనుక మీరు వారిసంతతివా
రు కారేమోయని కొందరు శంకింతురు. ఇది సరికాదు. రాజులు అ
పేరుగల నియోగిబ్రాహ్మణులు క్షత్రియులసంతతి కారుగదా. పూర
రాజులబిరుదములు మాకు లేకపోయినను వారిసంతతివారము కామ
టకు వలనుపడదు.

---

శ్రీగురుభ్యోనమః.

## ఈకమ్మవారివాదము నంగీకరించనివారివాదము

:o:

1. సృష్ట్యాదియందు పరమేశ్వరుఁడు పూర్వకల్పములోని జీవుల
గుణకర్మముల ననుసరించి వారికి బ్రాహ్మణక్షత్రియాదిశరీరముల
నిచ్చెను. ఆ బ్రాహ్మణక్షత్రియాదులసంతానమే క్రమముగా నభివృద్ధి
చెందినది. గనుక ఉత్పత్తినిబట్టియే జాతి యేర్పడును. అట్టిజాతికొన్ని
తపోవిశేషములచేత మారి యుత్తమజాతి కావచ్చును. కొన్ని పాప



ర్యములచేత మారి యధమజాతికావచ్చును. గనుక ఋషభుని
మారులు తపోవిశేషముచే కొందరు బ్రాహ్మణత్వము పొందినట్లు
వతములో జెప్పఁబడినది, శనకైస్తు క్రియాలోపాదిమాః క్షత్రి
తయః, వృషలత్వం గతాలోకే బ్రాహ్మణాదర్శనేనచ,, యను
స్మృతి వచనము కొందరు క్షత్రియులకు క్రియాలోపాదికమువలన
త్రియత్వముపోయి శూద్రత్వము ప్రాప్తమైనట్లు చెప్పఁబడినది. ద్వా
యుగమున కిటీవల క్షత్రియులకు కూడ బ్రాహ్మణత్వము సంపా
తగినవీలు అనఁగా నట్టి తపశ్శక్తియున్నట్లు గనుపించదు.

ఉత్పత్తివలననే జాతి యేర్పడుననుటకు, "శ్రు. బ్రాహ్మణో
స్య ముఖమాసీత్, బాహూరాజన్యఃకృతః, ఊరూతదస్యయద్వై
, పద్భ్యాగ్ం శూద్రోఅజాయత." అనుశ్రుతియు, "శ్లో. లోకా
ంతు వివృద్ధ్యర్థం ముఖబాహూ రుపాదతః, బ్రాహ్మణం క్షత్రియం
శ్యం శూద్రంచ నిరవర్తయత్" అను మను స్మృతి వచనము, "శ్లో.
ృ వేదవిదాం శ్రేష్ఠా బ్రహ్మణాం పరమేష్ఠినః, మహాదేవాజ్ఞయా
ర్వ వాసనాసహితా స్ముఖాత్ బ్రాహ్మణా బ్రాహ్మణస్త్రీభి స్సహ
తా స్తపోధనాః, తస్య హస్తా త్సహస్త్రీభి ర్జజ్ఞి రే పృథివీక్షితః,
రుభ్యాం సహితా స్త్రీభి ర్జాతా వైశ్యా శ్శివాజ్ఞయా, పద్భ్యాం
శూద్రాస్సహస్త్రీభి ర్జజ్ఞి రే వేదవిత్తమాః, సర్వేషాం జన్మనాజాతి
న్యథా కర్మకోటిభిః, పశ్వాదీనాం యథా జాతి ర్జన్మనైవ న
న్యథా, సాపిస్థూలస్య దేహస్య భౌతికస్య నచాత్మనః అను స్కాం
పురాణాంతర్గత సూతసంహితా ద్వాదశాధ్యాయము. ఇవి మొదలగు
ప్రమాణములు. విదురుఁడు శమదమాదిమహాగుణసంపన్నుఁడైనను

ధృతరాష్ట్రుఁడు బ్రహ్మతత్త్వమును చెప్పవలసినదనియడుగఁగా నే
శూద్రుఁడను. నీకు తత్త్వముపదేశింపతగను. బ్రాహ్మణజన్మముకలవా
యెంతరహస్యమునైనను జెప్ప నర్హుఁడు గనుక నీకు నే నుపదేశింప
త్సహింపనని చెప్పెను. దీనంజేసి యుత్పత్తివలననే జాతివచ్చును. గా
గుణకర్మలవలన జాతిరాదని నిర్ణయింపబడినది. భారతము, ఉద్యో
పర్వము, అధ్యాయము 50. "శ్లో. శూద్రయోనా వహం జాతో న
తో ఽన్య ద్వక్తు ముత్సహే, కుమారస్య తు యా బుద్ధి ర్వేద తాం శా
శ్వతీ మహం, బ్రాహ్మీహి యోనిమాన్నస్సు గుహ్యమపియోవ దేత్
న తేన గర్హ్యో దేవానాం తస్మా దేతద్బ్రవీమి తే:" ఈశ్లోకములు యి
దుకు ప్రమాణములు. భారతము, అనుశాసనికపర్వము, అధ్యా
యము. 28. బ్రాహ్మణస్త్రీయందు శూద్రునివలన రహస్యముగా జన్మి
చిన మతంగుఁడనువాడు తాను చండాలుఁడని యొకగర్ధభము చెప్ప
గా తనచండాలత్వముపోయి బ్రాహ్మణత్వమువచ్చుటకై చాలాకాలము
తపస్సుచేయగా నింద్రుఁడు దర్శనమిచ్చి నీకెట్టితపస్సుచేతను కూడ
బ్రాహ్మణ్య మీజన్మమున లభింపదు. దేహధారి పాపకర్మమువలన
పశ్వాదిజన్మముపొంది తదనంతరము చండాలపుల్కసాది జన్మముపొంది
యనంతరము శూద్రాదిజన్మములఁబొంది యీశరీరములు నశించిన పిదప
చిరసంచితపుణ్యవశమున బ్రాహ్మణుఁడై పుట్టునని చెప్పఁబడియె. కాన
గుణకర్మములఁబట్టి జాతినిమార్చుటకు వీలులేదు. "శ్లో. బ్రాహ్మణ్యం
దుర్లభం తాత ప్రార్థయానో న లప్స్యసే, మతంగపరమంస్థానం
ప్రార్థయ న్వినశిష్యతీ." అని యిదిమొదలు అధ్యాయసమాప్తివరకు
గల శ్లోకములు ప్రమాణములు, గనుక మాపూర్వులు ప్రజాపరిపాల



నము చేసిరి. గుణకర్మలనుబట్టి వారు క్షత్రియులు అనుటచెల్లదు. అటు
లైనయెడల విదురుఁడు బ్రాహ్మణుఁడు కావలసివచ్చును. ఒకవేళ వాద
మునకు వీరిపూర్వులు క్షత్రియులని యంగీకరించినను లాభములేదు.
ప్రస్తుతకమ్మవారు కృషిపరులుగానున్నారు. వైశ్యులుకావలసివచ్చును.
కృషివైశ్యధర్మము. గనుక నిట్టివాదము నిష్ప్రయోజనము.

2. "కూర్మముపదధాతి" యనువాక్యము తాబేలును ఉపధా
నము చేయమని చెప్పినది. ఉపధానమనఁగా పూడ్చిపెట్టుట. ఈకూర్మ
శబ్దమువలన వారివాదమునకు లాభమేమియు లేదు. కూర్ముఁడను నొక
ఋషియు, రాజును ఉండిన నుండవచ్చును. జయపురాధీశ్వరులు మొ
దలగువారలు తమ్ముకూర్మకులావతంసులుగాఁ జెప్పుకొనినను జెప్పుకొని
యుందురు. ఆకూర్మకులావతంసులే యిప్పటికమ్మవార లనుటకుమాత్ర
మాధారములను వారు చూపియుండలేదు. చిలుకూరి వీరభద్రరావు
గారు వ్రాసిన యంశములు సంగతములుగాగనుపించవు. కూర్మశబ్దము
కురమ, కుమ్మర యని మారతగియుండఁగా అదియంతయు లేక కమ్మ
యని మారినది. మేము కూర్మవంశమువారలమని చెప్పుట యుక్తియుక్త
ముగాలేదు నాలుగైదుశతాబ్దములనుండి కమ్మ, రెడ్డి, వెలమ యను
కులములలోని సంస్థానాధీశ్వరులు శూద్రులుగానే వారిపై కృతుల
నిచ్చిన కవీంద్రులచే వర్ణింపఁబడినారు. శ్రీనాథమహాకవికృతకాశీ
ఖండము. "ప. పతగకేతను శ్రీపాద పంకజంబు, కారణంబుగజన్మించి
భూరి మహిమ, గంగసైదోడురిపుకోటిగళముత్రాడు, నాలుగవజాతి
సమధికోన్నతివిభూతి." "ఆవర్ణంబున నుద్భవించె గుణరత్నార్ణోనిధా
నంబు శ్రీదూవూరుం బెరుమాదిరెడ్డి" ఇత్యాదికము. వారు కూర్మ

కులావతంసక్షత్రియులైన యెడల కవులా సంగతిని వర్ణించియే యుందురు. తామే వర్ణమైనది గమనించుటకు మహారాజులగు అనవేమ మహారెడ్డి మొదలగువారికంటె నిప్పటివారలు సమర్థులని గ్రహించుటకు వీలులేదు.

కమ్మవారగు ముక్త్యాల వాసిరెడ్డివారిపై అమరావతి రామకవిచే కృతియీయఁబడిన ద్రౌపదీపరిణయ మనుగ్రంథమున "ఉ. నిరత ధ్యానమునీంద్ర హృద్భవనసందీప్త ప్రదీపంబు, శ్రీకరసంవాహనసంయుతంబు, నతలేఖస్ఫారచూడామణీకర నీరాజనరాజితంబు నగు శ్రీకంజాక్షుపాదాబ్జమందు, రహిఁ గంగకు కూర్మితమ్ములయి శూద్రులై పుట్టి రచ్యుతకృతిన్. అమ్మధుజిత్పదోద్భవకులాఢ్యులలో, నొకకొందరాత్మభాగ్యమ్మున, కల్మి గమ్మదనమందుట దానమునీవ నీప్సితార్థఖుల, నిత్తు మర్థితతి రమ్మని కమ్మ లిఖించి సర్వదేశమ్ముల కంపుటన్, ధరణిసన్నుతి కెక్కిరి కమ్మవారనన్." అని యున్నది. దీనిఁబట్టి కమ్మవారు శూద్రులనియే చెప్పఁబడినది వీరును కూర్మకులావతంస క్షత్రియులనివ్రాయుటలేదు. ఇటులనే తక్కినశాఖలవారునుకూడ శూద్రులని గ్రంథములలో చెప్పఁబడినది. వీనికన్నిఁటికిని విరుద్ధముగా కమ్మవారిని కూర్మకులావతంసులని యెటుల గ్రహింపఁగలము? ఆంధ్రభాషలో శబ్దములు నాలుగు తెఱంగులు. తద్భవములు, తత్సమములు, గ్రామ్యములు, దేశ్యములు కమ్మశబ్దము తద్భవమే కానక్కరలేదు, దేశ్యము కావచ్చును. కమ్మరాష్ట్రమను దేశమునఁబూర్వకాలము నివసించినశూద్రులు కమ్మవారుకావచ్చును. నైజాంలో కమ్మంమెట్టు అనుగ్రామము నిప్పటికినీ కలదు. కమ్మరాష్ట్రములో పూర్వము నివసించినబ్రాహ్మ



ణులు కొందరు కమ్మలని వాడఁబడియుండవచ్చును. ఈయూహాలకభ్యంతరముండదు. ఇట్టియూహలనుబట్టి కమ్మవారు కూర్మకులావతంసులని చెప్పుట యుక్తముగాదు.

3. ఓరుగల్లు ప్రభువులగు కాకతీయ వంశమువారు క్షత్రియులనుట సందిగ్ధము "అత్యర్కేందు కులప్రశస్తి మసృజద్వ్యం కాకతీయాన్వయం" అని ప్రతాపరుద్రీయమున కాకతివంశము సూర్యచంద్రవంశములకంటె భిన్నమని చెప్పఁబడినది. క్షత్రియులు సూర్యచంద్రవంశముల కంటె వేరుగా లేరు ఇదిలోకవిదితము. కమ్మవారిచరిత్రములో నుదహరించిన, "చతుర్థవంశ ప్రభవాస్త్రయోఽథ శంభుం సమారాధ్య తపోభిరామాః, ధాత్రీపతిత్వం భువిదుర్జయత్వం వర్మాంత నామాపి నరేంద్రచిహ్నం" అనుశ్లోకమున కాకతిరాజులు చతుర్థవంశప్రభువులు అనఁగా శూద్రులు ధాత్రీపతిత్వము వీరికి మొదటనుంచి లేదు. వర్మయనుపేరును మొదటనుంచిలేదు. అని స్పష్టపడినది. వీరు క్షత్రియులైనయెడల వర్మాంతనామమును తపస్సుచేసి సంపాదించుకొననేల కాకతీయరాజులు బుద్ధవర్మయను క్షత్రియునివంశమువారలు కనుక క్షత్రియులని చెప్పుటయు న్యాయ్యముకాదు. బుద్ధవర్మకు శూద్రజాతిస్త్రీయందుపుట్టిన పుట్టియుండవచ్చును "చతుర్థవంశప్రభవాః" అనుశ్రుతిని క్షత్రియప్రభవత్వలింగము బాధింపఁజాలదు. ఒకవేళ కాకతిరాజులు క్షత్రియులైనను కమ్మవారు వారివంశస్థులనుటకుఁ దగిన నిదర్శనములులేవు. కమ్మవారు మొదలగువారు కాకతిరాజవంశస్థులైనయెడల కవీశ్వరులు సుప్రసిద్ధమహారాజులగు కాకతిరాజులనే వాసిరెడ్డివారు మొదలగువారలకు మూలపురుషులని వర్ణించియుందురు.

గాన తమకు ఏవిధమగు సంబంధములేని కాకతిరాజులను తమకు మూలపురుషులని యెంచుట యుక్తముకాదు. ప్రాగ్దేశక్షత్రియులుకూడ తమకు కాకతిరాజులు మూలపురుషులని చెప్పుకొనుటలేదు.

4. కమ్మవారు, రెడ్లు మొదలగువారలు శూద్రులైనను జన్మాంతర పుణ్యవశంబున ప్రభుశక్తిగలిగి తురుష్కులు మొదలగు నితరజాతుల జయించి దేవబ్రాహ్మణభక్తిగలిగి సర్వవిధముల దేవబ్రాహ్మణులకుపచరించుచు వర్తించిరి. బ్రాహ్మణాజ్ఞాప్రకారము జరిపిన ప్రజాపరిపాలనము బ్రాహ్మణ శుశ్రూషయే యగును. కలికాలముగనుక స్వదేశమున క్షత్రియప్రభుత్వములు నశించియుండుటంజేసియు, స్వదేశత్యాగముదుష్కరము గనుకను శూద్రప్రభువులైనను దేవబ్రాహ్మణభక్తిగల సత్పురుషులు గనుకను వారిరాజ్యమందు నివసించిరి.

హిందూధర్మములందు భక్తి లేకపోవుటయేగాక సాధ్యమైనంతవరకీధర్మముల రూపుమాపుటయందుద్యుక్తులగు తురుష్కులప్రభుత్వమందును హూణుల ప్రభుత్వమందును, నూర్ల సంవత్సరముల నుండి మహాబ్రాహ్మణులు నివసించుటలేదా వీరికంటె వేయిమడుంగులు ధర్మాత్ములగు శూద్రులప్రభుత్వమందు బ్రాహ్మణులు నివసించిరనిన తప్పేమియు గనుపించదు. ఇట్టి హేతువులచేత నాలుగవజాతియనియు " శూద్రుల్పుట్టి రచ్ఛాకృతిః " అనియు కంఠోక్తి బాధింపఁబడదు.

5. కమ్మవారు శూద్రులేయైనయెడల నెలదినము లాశౌచముండవలెనుగదా. వారటుల నాచరించుటలేదు గనుక శూద్రులుకారు అనుటచెల్లదు. " శ్లో॥ శూద్రస్యమాసమాశౌచం తదర్ధంన్యాయవర్తి



నః " అని అభినవషడశీతియందును నిర్ణయసింధు ప్రభృతి గ్రంథముల లోను గలదు. దేవబ్రాహ్మణ శుశ్రూషచేయుచు వర్తించు శూద్రప్రభువులు న్యాయవర్తులు గనుక వారికి 15 దినము లాశౌచమనుట న్యాయ్యము. ఇదిగాక శూద్రులుగా పరిగణింపఁబడిన చాకలి, మంగలి మొదలగువారలుకూడ 15 దినములే యాశౌచముపట్టుచున్నారు. గనుక 15 దినము లాశౌచముబట్టుటనుబట్టి కమ్మవారు క్షత్రియులనుటకు వలనుపడదు. ఇదిగాక క్షత్రియులకు 12 దినము లాశౌచముగాని 15 దినములు కాదు. గనుక నిదియు క్షత్రియత్వసాధకము కాదు.

6. శూద్రులు మూఁడుతరగతులు. సచ్ఛూద్రులు, అసచ్ఛూద్రులు, శూద్రులు, సచ్ఛూద్రులు గొల్లలు, మంగలులు.. మేమీయుభయులలో చేరముకదా? తక్కినయిద్దరు వారికంటె తక్కువవారు మేమువారిలోనుచేరము. గనుక క్షత్రియులమనుట యుక్తముకాదు. కమ్మవారికి జంధెములువేయించిన జి. యస్. బి. సరస్వతి జయార్థప్రకాశికయను తనగ్రంథమున మార్కండేయ పురాణోత్తరభాగము ప్రమాణముగా నుదాహరించినారు. ఆగ్రంథములోనే 15 వ అధ్యాయమున మహానందియను నొకక్షత్రియచక్రవర్తికి శూద్రస్త్రీయందు నందుఁడను కుమారుఁడు కలిగెననియు, అతఁడు మహాబలుఁడై క్షత్రియులు తనకు నమస్కారముచేయనందున ప్రపంచములోని క్షత్రియులనందరను సంహరించెననియు, అప్పుడు కొందరు క్షత్రియులు అతని బాధలు సహించలేక శూద్రప్రాయులైరనియు వర్ణింపఁబడినది. ఆశూద్రుఁడనునందునకు సుమాల్యుఁడు మొదలగునెనమండుగురు కొమాళ్లు

కలరనియు వర్ణింపఁబడినది. ఈసంగతి విష్ణుపురాణంబునను శ్రీభాగ
వతమునను కలదు. ఆగునూరులు, కమ్మ, రెడ్డి, వెలమ మొదలగువార
లనియు, వారు కాళహస్తిమొదలగు దేశములకు ప్రభువులుగా నియ
మింపఁబడిరనియు వర్ణింపఁబడినది. ఈకమ్మవారు మొదలగువారు
సచ్ఛూద్రులనియు యాగ్రంథమునసే వర్ణింపఁబడినది. యజ్ఞకర్మల
కుపయోగించెడి గోపోషణ క్షౌరాదులవలన గోపనాపితులు సచ్ఛూద్రు
లుగ పరిగణింపఁబడిరి. దుష్టనిగ్రహ శిష్టపరిపాలనముచేసి ధర్మస్థాప
కులై బ్రాహ్మణాజ్ఞా వశవర్తులైన కతంబున కమ్మవారలు మొదలగు
వారలు సచ్ఛూద్రులుగా పరిగణింపఁ బడిరి. ఈసంగతి విశదముగుట
కై ఆశ్లోకముల వ్రాయుచున్నాము.

మార్కండేయోత్తరపురాణే, ఉత్తరభాగే, 13-అధ్యాయే—
మహానంది సుతో రాజన్ శూద్రా గర్భోద్భవో బలీ, మహాపద్మపతిః
కశ్చిన్నందః క్షత్ర వినాశకృత్, సర్వ దేశస్థితం క్షత్రం నాశయిష్యతి
మూఢధీః, రాజకన్యా ప్రసూతానాం నామాని శృణు వక్ష్యతే, పుం
సపాటో మందపాటః కరదండశ్చ వీర్యవాన్, వత్సయూపశ్చ చత్వారో
మహానంది సుతా స్తతే ఇత్యారభ్య, 'శూద్రా గర్భోద్భవత్వాచ్చ
వేదోక్త విధిహీనతః క్షత్రవంశోద్భవా భావా న్నకరిష్యంతి తస్యతు
నమస్కారంతు రాజేంద్ర సర్వదేశస్థితాన్నృపాః, తస్మా త్కోపా త్ప
ద్మపతి ర్నందో బలపరాక్రమః, సర్వదేశ స్థితం క్షత్రం జేతుం వై సగ
మిష్యతి. ఇత్యారభ్య 15 అధ్యాయే పుంసపాటస్య రాజ్ఞశ్చ ద్వౌ
పుత్రౌతు భవిష్యతః, సూర్యశ్చ పుంసపాలశ్చ సంజ్ఞకా బలవత్తరాః
ఇత్యారభ్య నందో రాజా మహావీర శ్శతసంవత్సరం ముదా. సర్వభూ



మండలం సమ్యక్ పాలయిష్యతి సాదరం, బ్రాహ్మణా న్పాలయన్నిత్యం
న్యాయమార్గానుసారతః మహాపద్మ పురీనాథో నందో రాజామహా
బలః, క్షత్రియా న్నాశయ న్నిత్యం పాలయిష్యతి మేదినీం. తస్య చా
ష్టౌ భవిష్యంతి సుమాల్య ప్రముఖాస్సుతాః, సుమాల్యో మాల్య
వాం శ్చైవ కమ్మో వర్మో విమత్సరః, వెలమో ధూళికేతుశ్చ రెడ్డిశ్చే
తిచ నామకాః వేదపర్యాఖ్యవిప్రేణ సర్వశాస్త్రార్థ శోభనాన్, విద్యా
వతశ్చ పుత్రాంస్తు కారయిష్యతి నందకః. తస్మా త్సచ్ఛూద్ర జాతీయా
భవిష్యంతి న సంశయః, మహా పద్మాఖ్య నగరే నందో రాజా
మహాబలః, సుమాల్యం జేష్టపుత్రంచ హ్యభిషేక్ష్యతి సాదరమ్.
నందో రాజా మాల్యవంతం ద్వితీయం పుత్రమేవచ సబాఖ్య
నగరే సమ్య గభిషేక్ష్యతి సాదరం. పుత్రంచ కమ్మనామానం
తృతీయం నందభూపతిః. విదర్భదేశే కృష్ణాయాస్తీరే సమభి
షేక్ష్యతి విమత్సరాఖ్యంపుత్రంచ నందరాజో మహాబలః. పెన్నానదీ
తీరదేశేరాజానం కారయిష్యతి పుత్రం వెలమనామానం ధీరంనందో
మహీపతిః, శ్రీకాళహస్తిదేశేతు రాజానం కారయిష్యతి. రెడ్ద్యాఖ్య
పుత్రంనందస్తు మహాబలపరాక్రమః, స్వీకృత్య గౌతమీం రమ్యా
మాగమిష్యతి భూతలే. మహానందేనదేవేన స్థాపితేనసుఖాచలే,
మహానందీశ్వరేణైవ పాలితే దేశఉత్తమే, పట్టసాచలసంస్థేన వీరభద్రేణ
పాలితే, గోదావరీతటేరమ్యే తంపుత్రమభిషేక్ష్యతి, నంద పుత్రా
మహాధీరా స్సుమాల్య ప్రముఖానృపాః. స్వస్వదేశాన్ మహా
యోగ్యాన్ పాలయిష్యంతిసాదరమ్—భాగవతే, 12 స్కంధే, అ. 7.
మహానంది సుతోరాజన్ శూద్రోగర్భోద్భవో బలీ, మహాపద్మపతిః
కశ్చిన్నందః క్షత్రవినాశకృత్, తతో నృపా భవిష్యంతి శూద్రప్రాయా

స్త్వధార్మికాః, ఏకచ్ఛత్రామిన పృధివీ మనుల్లంఘితశాసనః, శాసిష్యతి మహాపద్మో ద్వితీయ ఇవ భార్గవః, తస్య చాష్టౌ భవిష్యంతి సుమాల్య ప్రముఖాస్సుతాః విష్ణుపురాణేష్వేవం,"

ఈ ప్రమాణములనుబట్టి విచారించగా క్షత్రియునివలన శూద్ర స్త్రీయందు బుట్టినందున అనులోమసంకరులగుచు అనులోములు గనుక మాతృజాతిచే పరిగణింపఁబడి క్రమముగా ప్రజా పరిపాలనము కల్గిన నీ కమ్మ, రెడ్డి మొదలగువారలు శూద్రులనుటకు సంశయము లేదు. గుణ కర్మలనుబట్టి జాతి యేర్పడినయెడల నందుఁడు ప్రజాపరిపాలకుఁడు గనుక క్షత్రియుఁడైనందున రాజులందరు నతనికి నమస్కరించియుందురు. గనుక పుట్టుకనుబట్టియే జాతియనుటకు సంశయము లేదు. కమ్మవారు మొదలగువారు ప్రభుత్వముచేసిరి. గనుక నీవు, నాయుడు మొదలగు బిరుదముల ధరించియుండవచ్చును. అంత మాత్రముతో క్షత్రియులుకారు.

7. "పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం" అని చెప్పఁబడినది. మేము నెవ్వరికిని పరిచర్యచేయుటలేదు. గనుక శూద్రులముకాము. అనుటకు వలనుపడదు పరిచర్య యనగా వారి యాజ్ఞానుసారము దుష్టుల శిక్షించి వారికివిధేయులై సహాయకారులై వర్తించుట అట్టి పనిని కమ్మరెడ్డి ప్రభువులుచేసియే యున్నారు. పాదసేవచేయుట అంట్లు తోముటయే సేవకాదు. అధికసంఖ్యాకులగు నిందరు శూద్రులతో పాదసేవాదులు చేయించుకొనుటకు బ్రాహ్మణాదులకు ప్రసక్తి లేదు. గనుక బ్రాహ్మణులపూజించుచు ధర్మవిరోధుల నిగ్రహించుచు వర్తించుట ద్విజశుశ్రూషయనియే చెప్పఁబడును. గనుక నే శూద్రుఁడగ



విదురుఁడు ధృతరాష్ట్రునియొద్ద మంత్రిత్వరూప ద్విజశుశ్రూష జేసి యున్నవాఁడు దానిని భీష్మాదిశిష్టాగ్రేసరు లంగీకరించినారు.

8. గోత్రములను ఇప్పుడు ఏర్పాటు చేసికొందుమనుట న్యాయ్యముకాదు. క్షత్రియత్వము సిద్ధించిన తరువాతగదా యీ విచారణము చేయవలెను. క్షత్రియత్వమే లేనట్లు గనుపట్టుచుండగా స్వేచ్ఛమైయు శాస్త్రాధారములేక గోత్రములను కల్పించుకొనినయెడల కల్పిత గోత్రములను మరల ఇష్టములేనప్పుడు విడువవచ్చును. ఏ యాధారములులేక యిష్టమువచ్చినట్టు గోత్రకల్పనముచేసికొనుటకు శాస్త్రమంగీకరించదు శాస్త్రములేకనే చేసినపని బాలక్రీడయగును. ఫలము నీయదు అనర్థమువచ్చును.

అగ్నిపురాణమున క్షత్రియవైశ్యశూద్రులకు పురోహితగోత్రములుండునని చెప్పఁబడినది. "క్షత్రియవైశ్యశూద్రాణాం గోత్రంచ ప్రవరాదికం, తథాన్యసంకరాణాంచ యేషాం విప్రాశ్చ యాజకాః" క్షత్రియవైశ్యశూద్రులకును సంకీర్ణులకును పురోహితగోత్రములుండునని చెప్పఁబడినది. గాని అట్టి నియతపురోహితులు వీరికి లేరు. ఇదిగాక, బ్రాహ్మణులు ద్రోహముచేసిరని వీరించెదరు. ఇట్టి వీరిగోత్రములును కమ్మవారికసహ్యములే గనుక పురోహిత గోత్రములను పెట్టుకొనుటయు సంభవించదు.

9. చిరకాలమునుండి ఉపనయనవేదాధ్యయనములులేనివారలు ఇప్పుడు ఉపనయనవేదాధ్యయనములుచేయుట న్యాయ్యకాదు. "అత ఊర్ధ్వం త్రయోప్యేతే యథాకాలమసంస్కృతాః, సావిత్రీపతితా వ్రాత్యా భవంత్యార్యవిగర్హితాః, నైతైరపూతై ర్విధివదా

వద్యపిచ కర్హిచిత్, బ్రాహ్మైః యానాంశ్చ సంబంధా నాచరేద్బ్రాహ్మణస్పృహా అని సకాలమున ఉపనయనముకానివారు వ్రాత్యులనియు ప్రాయశ్చిత్తముచేసికొనినయెడల వారితో వ్యవహరించకూడదనియు చెప్పఁబడినది మూఁడుతరములు ఉపనయనాదులు కానియెడల వారలకు పునరుపనయనాధికారమే యుండదనియు స్మృతులలో చెప్పఁబడినది. నూర్లసంవత్సరములనుండి ఉపనయనాదులు లేని కమ్మవారు వాదముకొరకు క్షత్రియులని యంగీకరించినను వారికి ఉపనయనాదిసంస్కారము సంభవించదు. బ్రాహ్మణులు మూఁడుతరములు సోమయాగము చేయనియెడల ఐంద్రాగ్నాశ్వినపశుయాగములుచేసి సోమయాగము చేయవలసినదని వేదమందు కలదు. గనుక వారటులచేయుదురు. అనేకశత సంవత్సరములనుండి యుపనయనాదులు లేనివారికి ఉపనయనములుచేయుటకు శాస్త్రము కనుపించదు. శాస్త్రమందు చెప్పనిప్రాయశ్చిత్తము విధించుట కెవ్వరికిని అధికారము లేదు. గనుక, కమ్మవారు క్షత్రియులని ఎంచినను వారికి ఉపనయనాదులు కూడవు. కమ్మవారు క్షత్రియులుకారని యిదివరకే నిరూపించినాము.

10. “మీరు క్షత్రియులైనయెడల ప్రసిద్ధక్షత్రియులతో సంబంధములు భోజనప్రతిభోజనము లుండవలసియుండును. అటులలేనందున మీరు క్షత్రియులుకారనుట యుక్తముకాదు. బ్రాహ్మణులలోను త్రిమతస్థులలో నిట్టిభేదములు కలవు. అందరు బ్రాహ్మణులే కదా! అటులనే మేమందరము క్షత్రియులము”. అని కమ్మవారనుట న్యాయ్యము కాదు. బ్రాహ్మణులలో పరస్పరభోజన ప్రతిభోజనసంబంధబాంధవ్యములు లేక పోయినను అందరు బ్రాహ్మణులే యని యన్ని తెగల వా-



రంగీకరించుదురు. పరస్పరకలహములున్నను తమజాతివారిని తమజాతివారు కారని యెవ్వరును చెప్పరు. కమ్మరెడ్డికులస్థులు క్షత్రియులైనయెడల భోజనప్రతిభోజనములు లేకపోయినను. ప్రసిద్ధక్షత్రియులు వీరిని క్షత్రియులని వాడెడివారలేను. అటుల వాడనందున వీరు క్షత్రియులు కారు.

11. అమ్మరాజవిజయాదిత్యుని శాసనము క్రీ. శ. 1000 భరద్వాజాన్వయః కమ్మకులజః కులవర్ధనః తస్యా భవత్సుత శ్రీమాన్ గోవిందో గురునందనః, శ్రౌతస్మార్తక్రియాధార స్తత్సుత స్సద్విజోత్తమః ఈశాసనమున ద్విజోత్తమః, కమ్మకులజః శ్రౌతస్మార్తక్రియానిష్టః, అని యున్నందున బ్రాహ్మణులలో కరణకమ్మలు. బొబ్బూరుకమ్మలు, ఆరువేలకమ్మలు అనుభేదములు కలవు. వారే చెప్పఁబడిరి. అంతియే గాని. దీనినిఁబట్టి కమ్మవారిలో బ్రాహ్మణులుకలరని చెప్పుట యుక్తము కాదు. కమ్మవారలము పౌరుషశాలురమని చెప్పుకొనుచు భిక్షమెత్తుకొను బ్రాహ్మలము మేమనిచెప్పుట కేవలాసంగతము.

ఇటులనే క్రీ. శ. 1011 అయిదవపశ్చిమచాళుక్యవిజయాదిత్య శాసనములో కమ్మకులోద్భవం, విప్రకులకమలభాస్కరం, దిండిపండితపుత్రిం అనునప్పుడుగూడా బ్రాహ్మణులలోనే అంతర్భాగము వెలనాడు, తెలగాణ్యము, అనునట్లు కమ్మ యనునదియు ఆకాలమున అంతర్భాగము కాని వేరుకాదు.

క్రీ. శ. 1673 చందలూరు శాసనములో బ్రాహ్మణేభ్యః, ఛందోగేభ్యః, షట్కర్మనిరతేభ్యః, కౌండిన్యగోత్రేభ్యః, సతతావిచ్ఛిన్నపంచమహాయజ్ఞేభ్యః,అని చెప్పఁబడినందున బ్రాహ్మణులకే ఆకాల

మున బోయలు అని ఉపనామముండి యుండవచ్చును. అథవా, ఆశాసనము అక్షరములు శాసనశోధకులకు తెలియకుండవచ్చును.

ఇట్టి శాసనమునుబట్టి బోయబ్రాహ్మణులుకలరని సమన్వయము చేయుట యుక్తముగాదు. పుట్టుకనుబట్టియే జాతియని వేదము, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు నిరూపించుచుండగా బోయలు బ్రాహ్మణులైరని చెప్పుట యుక్తముకాదు.

12. ఈహేతువులన్నియు దుర్బలములు గనుక అనాదికాలమునుంచి వైశ్యులనిపాడంబడు సంఘముకంటె ముందు తీర్థప్రసాదాగౌరవముల నపేక్షించుట యుక్తముగా కనుపించుటలేదు.

13. శ్రీశంకరులవారికి లోగడ బ్రాహ్మణాదివర్ణ విభాగమున్నియు నశించినవి. అందరును బౌద్ధులైయుండిరనుట సరికాదు. భట్టపాదులు, మండనపండితులు, ప్రభాకరుడు, ఉభయశంకరాచార్యులు మొదలగు మహాపండితులు ఆకాలమున నుండినట్లును, శ్రీశంకరులు సంచరించిన అన్ని దేశములలోను బ్రాహ్మణోత్తములుండినట్లును శంకర విజయమున గనుపట్టుచున్నది. "యత్రోప మృత్యుర్భహిః శేవయాతి బ్రాత్యా ప్రదేశం శనకైరనర్థ్యా దృష్ట్వా ద్విజాతీ న్నిజకర్మనిష్ఠాన్ మారాన్నిషిద్ధం త్యజతోఽప్రమత్తాన్ యస్మిన్ సహస్ర ద్వితయం జనానా మగ్న్యాహితానాం శ్రుతిపాఠకానాం వసత్యవశ్యం శ్రుతిచోదితాను క్రియాను దక్షం ప్రథితానుభావం, ఇట్టిశ్లోకము లాయాదేశములందు బ్రాహ్మణాదివర్ణము లానాటి కుండెననియే చెప్పుచున్నవి ఇటులనే అన్నివర్ణములవా రుండిన ట్లూహింపవచ్చును ఇప్పుడు కమ్మ, రెడ్డి మొదలగుకులములలో కొందరు క్రైస్తవమతమునవలంబించి



నట్లు శ్రీశంకరులకు లోగడ జనులు బౌద్ధమతము నవలంబించినను ఇతరజాతి భోజన ప్రతిభోజన సంబంధబాంధవములు లేకయుండిరి. శ్రీశంకరులు బౌద్ధజైనాదిమతములు మంచివికావని బోధించి ఆయా వర్ణస్థులకు తగుప్రాయశ్చిత్తముల విధించి స్వవర్ణాశ్రమ ధర్మనిష్ఠుల జేసిరి గాని, గోత్ర సూత్ర వేద ప్రత్యభిజ్ఞలులేనివారిని గోత్రసూత్రాదుల కల్పించికొందరిని బ్రాహ్మణులుగాను, మరికొందఱ క్షత్రియులుగాను మరికొందరవైశ్యులుగాను మరికొందర శూద్రులుగాను జేసిరనుట కేవలవిరుద్ధము. ఇట్టియర్థము చెప్పతగిన ప్రమాణము లేవియు లేవు. వీరునుగనుపరచి యుండలేదు.

14. భట్రాజులు వందిమాగధులు వారు సంకీర్ణులు. వారికి మొదటనుండి జన్నిదములుండి యుండవచ్చును. వారికిని వేదోక్త కర్మములులేవు. ఋషిగోత్రములును లేవు. ఒకవేళ ఋషిగోత్రములుండినను శూద్రులకును, సంకీర్ణులకును పురోహితగోత్రములుండినను యన్నిపురాణములో చెప్పంబడినందున వారు సవర్ణశూద్రాన్య తమలనుటకు సంశయ ముండదు.

15. నియోగులు బ్రాహ్మణులనుటకు సంశయములేదు. పూర్వకాలపు గ్రంథములలోను వారు బ్రాహ్మణులనియే ఉదాహరింపబడినది. గనుకవారు గౌరవార్హము రాజశబ్దమునుధరించిరని చెప్పవచ్చును కాని,

కమ్మవారు క్షత్రియులగుదురా కారా యని సంశయముకలిగినప్పుడు. పూర్వరాజుల యుపనామములు బిరుదులు ఇప్పటి కమ్మవారికి లేనందునను, ఇప్పటికమ్మవారు ధరించెడినీడు, నాయుడు, చౌదరి

యనుపేళ్లు పూర్వరాజులకు లేనందునను ఈకమ్మవారు క్షత్రియవంశస్థులనుట యుక్తముగా కనుపించదు.

శ్రీశంకరోవిజయతే.

శ్రీజగద్గురుపుష్పగిరిసంస్థానం దివాన్ బోయలకుంట్ల సుబ్బనరసయ్య. వ్రాయువిజ్ఞాపనము:—

అయ్యా,

ఆంధ్రదేశమున కమ్మవారు, రెడ్లు, వెలమవారు కాపులు అనుభేదములుగల ప్రజలు గౌరవనీయులగుచు చిరకాలమునుండి వర్తించుచున్న సంగతి తమకందరకు విశదమే. వీరుచిరకాలమునుండి శూద్రులుగా పరిగణింపఁబడుచు పురాణోక్తధర్మముల నాచరించుచు దేవబ్రాహ్మణ భక్తిగలిగి వర్తించుచున్నవారలు. వీరిలోప్రభువులు కొందరు బ్రాహ్మణ పండితులకును మతత్రయ మఠాధీశ్వరులకును అగ్రహారాది సన్మానముల నాచరించియుండిరి. అయ్యవి యవిచ్ఛిన్నముగా నేటివరకు జరుగుచున్నయవి. ఇప్పుడు జి. యస్. బి. సరస్వతియను నొకయతియీ కమ్మవారు మొదలగువారు క్షత్రియులనియు బ్రాహ్మణులు ద్రోహబుద్ధితో వీరిని శూద్రులుగా పరిగణించిరనియు, వీరందరు వేదోక్తకర్మముల యథేష్టముగా నాచరింపవచ్చుననియు, బోధించికొందరకు జందెములవేయించి శూద్రులనే పురోహితులుగా నేర్పరచిపూర్వాచారముల నిర్మూలనముచేయు చున్నారు కమ్మవారలు కొందరు ఆయనబోధలకువశులై ఆయనచెప్పినరీతినే చేయుచున్నారు. ఇటులుండ కొల్లూరుగ్రామమున కొందరుకమ్మవారు మాసంస్థానమునకు కమ్మవారలమగు మేము చాతుర్వర్ణ్యములలో నేజాతివారలమో, శాస్త్రప్రకారము విమ



ర్శించి సెలవు ఇవ్వవలసినదని లిఖితరూపముగ విజ్ఞాపన [illegible] మ కున్నారు. అటుపైని కొన్నిసభలు వాదప్రతివాద రూపములుగా జరుపబడినవి. ఇప్పుడు వ్రాయునదేమనగా. ఇదిగొప్పసమస్య. కనుక స్వతంత్రించి తీర్పుచెప్పుట న్యాయ్యముకాదని యెంచి తమబోఁటి పండితులయొద్దకు ఉభయవాదముల ప్రమాణవిషయములఁ బంపి అప్రమాణములపై తమయభిప్రాయములఁ బంపవలసినదనియు, ఇంకతమకు విశేషములగు ప్రమాణయుక్తులు ఏపక్షమునకైన ననుకూలముగాఁ గనుపడినయెడల వానినిఁగూడ, వ్రాసిపంపవలసినదనియు, నాపండితులను గోరి వారియభిప్రాయములరప్పించి బహువిద్వజ్జనాభిమత రీతిని తీర్మానించవలసి యుండునని యీపీఠాధ్యక్షులగు శ్రీజగద్గురువులగు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ భారతీస్వాములవారాజ్ఞ నొసంగినందున వారియాజ్ఞానుసారము తమకీయుత్తరమును ఉభయపక్షముల వాదప్రతివాద సంగ్రహములను బంపుకున్నాను. నిష్పక్షపాతబుద్ధితో వీనిని విమర్శించి తమకు ఈపత్రికచేరిన 15-దినములలో తమయభిప్రాయమును బంపవేఁడుచున్నాను.

2-9-1924.
తెనాలితాలూకా కొల్లూరు.

ఇట్లు.
బోయలకుంట్ల సుబ్బనరసయ్య, దివాన్.

కల్పితోభయవాద సంగ్రహము

సంపూర్ణము.



శ్రీ

# బ్రాహ్మణేతర విజయము.

## కల్పితోభయవాద సంగ్రహ విమర్శనము.

సీ॥ జనములోపము లేదు • సాహసంబధికంబు ।
కార్యశూరతఁజూపుఁ • డార్యులార ।
ధనములోపము లేదు • మనకులంబునఁజూడఁ ।
గార్యశూరతఁజూపుఁ • డార్యులార ।
తెలివిలోపము లేదు • ధీనిధుల్ గలరిందు ।
కార్యశూరతఁజూపుఁ • డార్యులార ।
వితరణఘనులుండె • హితముగామనయందె ।
కార్యశూరతఁజూపుఁ • డార్యులార .

గీ॥ వేదశాస్త్రాదులిప్పుడు • విడిగనచ్చుఁ ।
బడెను స్వరయుక్తముగ నోరు • కడనుజేరి ।
దేవురించఁగనేల వి • ద్దెలగడించి
కార్యశూరతఁజూపుఁ డో • యార్యులార ॥

బాలకవి కొసరాజు రాఘవయ్య చౌదరి.

1వ పేరాలోఁ బుట్టుకనుబట్టి జాతియేర్పడుననియు, నట్టి జాతులు తపో విశేషములచేతను, పాప కార్యములచేతను జాత్యంతరముగా మాఱ్పొందుటగలదనియు వ్రాసినారు. అటుల మాఱ్పొందుటయే "గుణ కర్మలననుసరించి ప్రథమమున వర్ణవిభాగ మేర్పడిన"దని మావాదన సిద్ధాంతము చేయుచున్నది. కావునఁ "బుట్టుకనుబట్టి వర్ణవిభాగమేర్పడిన"దను వారి వాదమున కిసుమంతయుఁ జోటులేదు. గుణకర్మల ననుసరించి జాతి జాత్యంతముగా మాఱుట ద్వాపర యుగమున కిటీవల లేదని నుడివినారు. అయ్యపబద్ధము. నేఁటికి దశ శతాబ్దములకుఁ బూర్వమట్టి మార్పులు జరుగుచున్నట్లు 1923 సం॥ 'శారద' పత్రిక మూడవ సంచికలోఁ బ్రచురింపబడిన రెండవ అమ్మరాజ విజయాదిత్యుని నూతన తామ్రశాసనము వచింపుచున్నది. అటుల నప్పటివరకు నట్టిమార్పులు గల్గుచుండినటుల నింకనెన్నియో ప్రమాణములు గలవు. గ్రంథవిస్తరభీతిచే నుదాహరింప మానితి.

వేయి సంవత్సరముల కిటీవల నట్టి మార్పులు జరుగుటలేదనుట ప్రత్యక్షసిద్ధము. అది యటులుంచుఁడు. "ప్రథమమునఁ దపో విశేషాదులచే జాతులు మార్పొందున"ని వ్రాసి "యుత్పత్తినిఁబట్టి యేవర్ణవిభాగమేర్పడున"ను దానికి "బ్రాహ్మణోస్యముఖమాసీత్" అను శ్రుతివాక్యమును, శ్లో॥ "లోకానాంతు వివత్యర్థం" అను స్మృతిశ్లోకమును, శ్లో॥ "తస్యవేదవిదాం" అను స్కాందపురాణాంతర్గత సూతసంహితములోని శ్లోకమును బ్రమాణముగాఁ జూపిరి. కాని యందలి తాత్పర్యార్థము వీరి యూహలకు సహకారి గానేరదని నాతలంపు.



"బ్రాహ్మణోస్య" ఋక్కునకు ముందున్న ఋక్కు పరబ్రహ్మముయొక్క ముఖ బాహూరుపాదములేవని ప్రశ్నింపగా నీఋక్కు (బ్రాహ్మణోస్య) భిన్నార్థములగు మూఁడు ధాతువులతోఁ బరబ్రహ్మముయొక్క ముఖబాహూరుపాదము లివియని నిరూపించినది. కాని యీఋక్కువలనఁ "బుట్టుకచే వర్ణవిభాగంబు"ను సూచన యిసుమంతయుఁ గానరాదు.

ఆఋక్కునందుఁ బ్రయుక్తమయిన ఆసీత్, కృతః, అజాయత అను ధాతువులకుఁ బుట్టినను నర్థముఁ జెప్పునెడల "బాహూరాజన్యః కృతః" అను దానింబట్టి బాహువులందుఁబుట్టినవారే క్షత్రియులు గావలయును గదా! అట్లైన క్షత్రియులకుఁ బ్రథమ పురుషులైన సూర్యచంద్రులు బాహువులనుండి జనించిన ట్లేశాస్త్రమునందుఁ జెప్పఁబడి యుండలేదు.

మఱియు "బ్రాహ్మణోస్య" అను ఋక్కునకుఁ దరువాత బ్రయుక్తమైన "చంద్రమామనసోజాత శ్చక్షోస్సూర్యఅజాయత" అనుఋక్కునకుఁ బైవిధముగా నర్థముఁ (పుట్టిన) జెప్పునెడల చక్షుః మనస్సులనుండి సూర్యచంద్రులు బుట్టిరనవలయునుగదా! అట్లనిచెప్పిన సూర్యచంద్రులకు భుజములందు జననము సంభవింపక పోవుటంబట్టి వారికి క్షత్రియత్వము లేదనవలయును. సూర్యచంద్రులు క్షత్రియులుగాని పక్షమునఁ దద్వంశీయులు క్షత్రియులుగారనుటలో లేశమంతయు సందేహము లేదుగదా? అట్లనుట లోకవిరుద్ధముగాదా? కావున "బ్రాహ్మణోస్య" అనుఋక్కు పరబ్రహ్మముయొక్క ముఖ బాహూరుపాదములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని వక్కాణించుచున్నదనుట సిద్ధాంతమగుచున్నది.

"లోకానాంతు వివృత్యర్థం తస్య వేదవిదాం" అను శ్లోకము పరబ్రహ్మముయొక్క ముఖబాహూరు పాదములనుండి బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యశూద్రులు బుట్టిరనునర్థము నిచ్చుచున్నవి. కాని వా[రి] యాశయమేమని యరయగా "బ్రాహ్మణోస్య" అనుదానింబట్టి ప[ర]బ్రహ్మముయొక్క ముఖబాహూరుపాదంబులు బ్రాహ్మ, క్షత్రియ వైశ్య, శూద్రులను నర్థముననుసరించు పరబ్రహ్మముయొక్క ముఖ బాహూరు పాదంబులనుండి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రుల బుట్టిరని మధ్యనెవరో వర్ణసమునకై కల్పింపఁబడినటులఁ దెల్లమగుచున్నది. మతంగుఁడు చండాలజాతి యందుఁబుట్టి యాశరీరముననే మహర్షియైనదందఱెఱింగినదియే. ఏదియెట్లున్నను బ్రప్రథమమున గుణకర్మలఁ బట్టి వర్ణవిభాగంబేర్పడినదను సిద్ధాంతమును వీరాదియందు నొప్పుకొన్నదియే. కావున నీవిషయమునిఁక విరమించుచున్నాను.

2వ పేరాలో వ్రాఁతలు సభలో వాద ప్రతివాదములు జరి[గి] విమర్శింపఁబడినయున్నకతన నిప్పుడు వేఱుగా విమర్శింపనవసరము లేదు.

3వ పేరాలోని యంశములు గొన్ని సభలో విమర్శింపఁబడిన వల్లుంచి, నూతనముగా వీరిచేఁ గల్పింపఁబడినవి గొన్ని గలవు వానిని నిట విమర్శించెద. పరీక్షింపుడు.

"వీరు (కాకతీయులు) క్షత్రియులైన యెడల వర్మాంత నామమును దపస్సుఁజేసి సంపాదించుకొననేల?" అని ప్రశ్నించుచున్నారు.

"కాకతీయులు మొదటినుండియు సూర్యచంద్రవంశములకు, వైదికమతమునకు, భిన్నులైన క్షత్రియులే యనియు, వారిటీవల వైదిక



మతమవలంబించిన తరువాత వైదికమత చిహ్నములుగా సూర్యవంశపు క్షత్రియులుగాను వర్మాంత నామధారులుగాను జేయుటకై వైదిక మత ప్రచారకులు చేసిన కల్పనలని కమ్మవారి చరిత్రములో వివరింపఁబడి యుండుటచేఁ బైప్రశ్నమున కిచ్చట జవాబుఁ జెప్ప మానితి.

మఱియు "ఒకవేళ కాకతిరాజులు క్షత్రియులయినను, కమ్మవారు వారి వంశస్థులగుటకుఁ దగు నిదర్శనములు లేవు. కమ్మవారు మున్నగువారు కాకతి సంతానస్థులయిన యెడల కవీశ్వరులు సుప్రసిద్ధ మహారాజులగు కాకతి రాజులనే వారి రెడ్డి, మున్నగు వారలకు మూలపురుషులని వర్ణించియుందురు. కాని దమకుఁ నేవిధమగు సంబంధములేని కాకతి రాజులను దమకు మూలపురుషులని యెంచుట యుక్తముగాదు" అని 3వ పేరాలో వ్రాసిరి.

"కాకతీయులు, రెడ్డి మున్నగువారికి మూలపురుషులని మేము చెప్పుట లేదు. కాకతీయులనగా కమ్మవారనఁగా నొక్కే శాఖవారని కమ్మవారి చరిత్రములో బెక్కు నిదర్శనములచే ధ్రువపరచియున్నాము. అదియుంగాక కాకతీయులు, కమ్మవారు, రెడ్డివారు చోళులనియు, వెలమ, బలిజ వారలు చాళుక్యులనియు సంత్యమున నుదహరింపఁబడిన విషయంబులం గాంచిన సుబోధకమగును.

"పూర్వ గ్రంథకర్తలా నిర్ణయముఁ దెలియఁజాలక కొందరు, అసూయాపరులై కొందరు బహుభంగుల వికటపు వ్రాఁతలు వ్రాసిరి"ని కమ్మవారి చరిత్రములో విమర్శనా భాగమందు నిరూపించియున్నాము. గమనింపుడు.

4వ పేరాలో "బ్రాహ్మణాజ్ఞా ప్రకారము జరిపిన ప్రజాపరిపాలనము బ్రాహ్మణ శుశ్రూషయే యగును. కలికాలము గనుక స్వదేశమున క్షత్రియ ప్రభుత్వములు నశించి యుండుటం జేసియు, స్వదేశత్యాగము దుష్కరము గనుకను, శూద్ర ప్రభువులైనను దేవబ్రాహ్మణ భక్తిగల సత్పురుషులు గనుకను, వారి రాజ్యమందు (బ్రాహ్మణులు) నివసించిరి." అని వ్రాసినారు.

మీరు బ్రాహ్మణాజ్ఞా ప్రకారము ప్రజాపరిపాలనముఁ జేసియుండలేదు. ఒక సమయమున నట్లు గావించినను "ప్రజాపరిపాలనము సేవకత్వమ"నుట శుద్ధ యవివేకము. ఒకవేళ బ్రాహ్మణులు చెప్పిన చొప్పున వర్తించిన "బ్రాహ్మణ శుశ్రూష" యైనపక్షమున, బ్రాహ్మణేతరులు చెప్పిన చొప్పున బ్రాహ్మణులు ప్రవర్తించిన "బ్రాహ్మణేతర శుశ్రూష"యనియే భావింపవలయును గదా! రామాదులు బ్రాహ్మణవచన ప్రకారము ప్రవర్తించినటులఁ దెలియుచున్నది. అయ్యది "బ్రాహ్మణ శుశ్రూష" యగునా? అటులయిన 'నందరును శూద్రుల'నియే చెప్పవలసి వచ్చును.

5వ పేరాలో దేవబ్రాహ్మణ శుశ్రూషచేయుచు వర్తించు శూద్ర ప్రభువులు న్యాయవర్తులు గనుక, వారికి 15 దినములశౌచమనుట న్యాయము. ఇదిగాక శూద్రులుగాఁ బరిగణింపఁబడిన చాకలి, మంగలి, మున్నగు వారలుగూడ 15 దినములే యశౌచముఁ బట్టుచున్నారు. కనుక కమ్మవారు 15 దినములశౌచమును బట్టుటనుబట్టి 'క్షత్రియుల, నుటకు వీలు పడదు' అని వ్రాసినారు. న్యాయవర్తులగు శూద్ర ప్రభువులకు 15 దినములశౌచము నొప్పుకొనుట యెట్లొప్పియుండును.



చాకలి, మంగలి మున్నగు వారలకు 15 దిన[illegible]చమని యెచ్చటను జెప్పఁబడియుండలేదు. కమ్మ, రెడ్డి మున్నగు శాఖలవారును, చాకలి, మంగలి మున్నగు వారందరును న్యాయవర్తులని చెప్పెదరా? అట్లయిన వందనములు. అటుల న్యాయవర్తులుగాని మొదల నెల దినములశౌచమును ధర్మశాస్త్రానుసారముగ వారిచే నేల పట్టింపరో ప్రత్యుత్తర మియ్యవలసిన బాధ్యత మఠాధికారులమని నిక్కువారియందే యున్నదని నొక్కి వక్కాణించుచున్నాము. నెలదినములశౌచమునే జాతివారు నవలంబించకముందుగా నేకమాసాశౌచమును బోధించు నిరర్థక ధర్మశాస్త్రముల నధర్మ శాస్త్రములని యేల పిలువఁగూడదో వివరింప భారము వారియందే గలదు. అట్టి యధర్మ శాస్త్రములు ప్రమాణములని రూఢిగా నిరూపించుచున్నాము.

6వ పేరా శూద్రులు మూఁడు తరగతులు. సచ్ఛూద్రులు, అసచ్ఛూద్రులు, శూద్రులు. సచ్ఛూద్రులు గొల్లలు, మంగలులు. కమ్మవారికి జన్నిదములు వేయించిన జ. యస్. బి. సరస్వతి స్వాముల వారిచే రచింపఁబడిన జయార్థ ప్రకాశికయను గ్రంథమున శ్రీస్వాముల వారు "కమ్మవారు శూద్రులుగార"నువిషయమునకు మార్కండేయ పురాణోత్తర భాగముఁ బ్రమాణముగా నుదాహరించినారు.

మఱియు నాగ్రంథమున 15 అధ్యాయమున 'మహానంది' యను నొక క్షత్రియ చక్రవర్తికి శూద్రస్త్రీయందు నందుఁడను కుమారుఁడొకఁ డుదయించెననియు, నతఁడు మహాబలుఁడై తనకు నమస్కరింపని క్షత్రియుల నందఱిని సంహరింపఁ బూనుకొనెననియు, నపుడు కొందఱు క్షత్రియులాతని బాధ నోర్వఁజాలక శూద్రప్రాయులయిర

నిము వర్ణింపఁబడినది. శూద్రుఁడగు నానందునకు సుమాల్యాదు లున్నగు నెనమండ్రు సుతులుదయించిరనియుఁ జెప్పఁబడినది. ఈవిషయము విష్ణు పురాణంబునను, శ్రీభాగవతమునను వర్ణింపఁబడినది. ఆపుత్రులు గమ్మ, రెడ్డి, వెలమ మున్నగు వారనియు, వారు కాశీ హాస్తి మొదలగు స్థలములకుఁ బ్రభువులుగా నియమింపఁబడిరనియు వర్ణింపఁబడినది. కమ్మ, మున్నగు వారలు సచ్ఛూద్రులనియు గ్రంథముననే పేర్కొనఁబడినది.

యాగాదికర్మల కుపయోగించెడి గోవులను బోషించుటవలన గోపకులును క్షౌర కర్మములవలన నాపితులును సచ్ఛూద్రులుగాఁ బరిగణింపఁబడిరి. దుష్టనిగ్రహ శిష్టపాలనముచేసి ధర్మస్థాపకులయి బ్రాహ్మణాజ్ఞా వశవర్తులైన కతనమునఁ గమ్మ మొదలగువారలు సచ్ఛూద్రులుగాఁ బరిగణింపఁబడిరి. ఈసంగతి విశదమునకై యాశ్లోకములఁ వ్రాయుచున్నాము.

మార్కండేయోత్తరపురాణే, ఉత్తరభాగే, 13-అధ్యాయే— మహానంది సుతో రాజా శూద్రా గర్భోద్భవో బలీ, మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్ర వినాశకృత్, సర్వ దేశస్థితం క్షత్రం నాశయిష్యతి మూఢధీః, రాజకన్యా ప్రసూతానాం నామాని శృణు వక్ష్యతే, పుంసపాటో మందపాటః కరదండశ్చ వీర్యవాన్, వత్సయూపశ్చ చత్వారో మహానంది సుతా స్తుతే ఇత్యారభ్య, శూద్రా గర్భోద్భవత్వాచ్చ వేదోక్త విధిహీనతః క్షత్రవంశోద్భవా భావా న్నకరిష్యంతి తస్యతు నమస్కారంతు రాజేంద్ర సర్వదేశస్థితా న్నృపాః, తస్మా త్కోపా త్పద్మపతి ర్నందో బలపరాక్రమః, సర్వదేశ స్థితం క్షత్రం జేతుం వై స



మిష్యతి. ఇత్యారభ్య 15 అధ్యాయే పుంసపాటస్య రాజ్ఞశ్చ ద్వౌ పుత్రౌతు భవిష్యతః, సూర్యశ్చ పుంసపాలశ్చ సంజ్ఞకౌ బలవత్తరౌ. ఇత్యారభ్య నందో రాజా మహావీర శ్శతసంవత్సరం ముదా. సర్వభూమండలం సమ్యక్ పాలయిష్యతి సాదరం, బ్రాహ్మణా న్పాలయన్నిత్యం న్యాయమార్గానుసారతః మహాపద్మ పురీనాథో నందో రాజామహాబలః, క్షత్రియా న్నాశయ న్నిత్యం పాలయిష్యతి మేదినీం. తస్య చాష్టౌ భవిష్యంతి సుమాల్య ప్రముఖాస్సుతాః, సుమాల్యో మాల్యవాం శ్చైవ కమ్మో వర్మో విమత్సరః, వెలమో భూమి కేతుశ్చ రెడ్డిశ్చేతిచ నామకాః. వేదవర్మాఖ్యవిప్రేణ సర్వశాస్త్రార్థ శోభనాన్, విద్యావతశ్చ పుత్రాంస్తు కారయిష్యతి నందకః. తస్మా త్సచ్ఛూద్ర జాతీయా భవిష్యంతి న సంశయః, మహా పద్మాఖ్య నగరే నందో రాజా మహాబలః, సుమాల్యం జేష్టపుత్రంచ హ్యభిషేక్ష్యతి సాదరమ్. నందో రాజా మాల్యవంతం ద్వితీయం పుత్రమేవచ సభాఖ్య నగరే సమ్యగభిషేక్ష్యతి సాదరం. పుత్రంచ కమ్మనామానం తృతీయం నందభూపతిః విదర్భదేశే కృష్ణాయా స్తీరే సమభిషేక్ష్యతి విమత్సరాఖ్యపుత్రంచ నందరాజో మహాబలః. పెన్నానదీ తీరదేశేరాజానం కారయిష్యతి పుత్రం వెలమనామానం ధీరంనందో మహీపతిః, శ్రీకాళహస్తిదేశేతు రాజానం కారయిష్యతి. రెడ్డ్యాఖ్య పుత్రంనందస్తు మహాబలపరాక్రమః, స్వీకృత్య గౌతమీం రమ్యామాగమిష్యతి భూతలే. మహానందేన దేవేన స్థాపితేనసుఖాచలే, మహానందీశ్వరేణైవ పాలితే దేశఉత్తమే, పట్టసాచలసంస్థేన వీరభద్రేణ పాలితే, గోదావరీతటేరమ్యే తంపుత్రమభిషేక్ష్యతి, నంద పుత్రా మహాధీరా స్సుమాల్య ప్రముఖా న్నృపాః. స్వస్వదేశాన్ మహా

యోగ్యాః పాలయిష్యంతిసాదరమ్—భాగవతే, 12 స్కంధే, అ. 1 మహానంది సుతోరాజన్ శూద్రాగర్భోద్భవో బలీ, మహాపద్మపతి కశ్చిన్నందః క్షత్రవినాశకృత్, తతో నృపా భవిష్యంతి శూద్రప్రాయా స్త్వధార్మికాః, ఏకచ్ఛత్రాంస పృథ్వీ మనుల్లంఘిత శాసనః, శాసిష్య మహాపద్మో ద్వితీయ ఇవ భార్గవః, తస్య చాష్టౌ భవిష్యంతి సుమాల్య ప్రముఖాస్సుతాః విష్ణుపురాణేప్యేవం,"

ఈ ప్రమాణములనుబట్టి విచారించగా క్షత్రియునివలన శూద్ర స్త్రీయందు బుట్టినందున అనులోమసంకరులగుచు అనులోమము గనుక మాతృజాతిచే పరిగణింపఁబడి క్రమముగా ప్రజా పరిపాలనము కల్గిన నీ కమ్మ, రెడ్డి మొదలగువారలు శూద్రులనుటకు సంశయము లేదు. గుణ కర్మలనుబట్టి జాతి యేర్పడినయెడల నందుఁడు ప్రజాపా పాలకుఁడు గనుక క్షత్రియుఁడైనందున రాజులందరు నతనికి నమస్క రించియుందురు. గనుక పుట్టకనుబట్టియే జాతియనుటకు సంశయము లేదు. కమ్మవారు మొదలగువారు ప్రభుత్వముచేసిరి. గనుక నీడు నాయుడు మొదలగు బిరుదముల ధరించియుండవచ్చును. అంత మాత్ర ముతో క్షత్రియులుకారు.

కొల్లూరునందుఁ గమ్మవారిచరిత్రమునుగురించి జరిగిన వా ప్రతివాదములలోఁ దామీవిషయమును వాదనకుఁదెచ్చియే యుండ లేదు. కనుకఁ బైవిషయమెంతమాత్రము నిజమని తలఁపఁగూడదు. దొంగవ్రాఁతలవి నమ్మఁడు. అందునకుఁ గొల్లూరు పురవాసులైన బ్రాహ్మణులే సాక్షిభూతులు.

ఆవాదనసమయమున నీవిషయమును దెల్పకయే తెల్పితిమని ప్రకటనఁజేయుటయు, నవీన మార్కండేయపురాణమును లేనివిషయము



చున్నటులఁ దెల్పుటయు నరయ వీరింకను దమ నిరుద్యోగమాయా వనమును స్థిరపఱుచుటకుఁ బడుచున్న పాట్లని విదితమగుచున్నది.

ఆవాదనసమయమందున వారు దమపై యభిప్రాయము [illegible] చ్చక గూఢముగాఁ బ్రకటనఁజేసిన సందులు సత్యమ[illegible] [illegible] ర్త్యముగావున విచారింతిము.

వీరిచేఁ బై ప్రమాణముగా నొసంగఁబడిన "మార్కండేయో త్తర పురాణే ఉత్తరభాగే" అను శ్లోకములు గల గ్రంథమొకటి ప్రపంచమునన్నటుల వ్యక్తమగుచున్నదిగదా !

కాని "మార్కండేయోత్తరపురాణముగల" దని చెప్పునంత ను వ్యక్తులీభరతఖండమునఁగలరాయను సందియమొదవుచున్నది.

మార్కండేయపురాణమేగదా యున్నది ! ఈచెనటులచేఁ జెప్పఁబడు నామార్కండేయోత్తర పురాణమేలేనపుడా పురాణము లోనిదను ప్రమాణమనుటెంతసత్యమో చదువరులేయూహింతురుగాక. దియుటుండనిండు. ఈకుక్షింభరులు సంస్కృతమున హ్రస్వ ఎకార ము లేదని యెఱుగరుగాఁబోలుచు. అవ్యక్తముగా వెలమ, రెడ్డి, యని హ్రస్వైకారపదములఁజేర్చినారు. అయ్యవి సంస్కృత భవములుగాక దేశ్యములైయున్నవి. కావున నవి వీరి కల్పితములని చెప్పక చెప్పుచు న్నవి. వీరిచేఁ బ్రమాణములుగా నొసంగఁబడిన శ్లోకములలోఁగొన్ని మార్కండేయపురాణములలోఁగలవు. మఱికొన్ని వీరికల్పితములు. మార్కండేయపురాణములోఁగల శ్లోకములకు వీరిచేఁ గల్పింపఁబడిన శ్లోకములకుఁగల రచనాభేదమే వీరికల్పితమును జాటుచున్నది.

ఇంతయేల! నందుని పుత్రులిట్టుల వేఱువేఱు శాఖలుగాఁ జీలి వలసిన కారణముగవడకపోవుటచేతను, అటులఁ జీలిరనుకొనిననును సూల్యాదుల కాలమునుండి యీశాఖలు ప్రచారములో లేకపోవుటచేతను వారివ్రాతనిరాధారపు వ్రాతయని. యెట్టి మందమతికైనఁ దెలియక పోదు.

పెక్కేల, కమ్మ, రెడ్డి, వెలమ, వారలచరిత్రము మార్కండేయపురాణములోనున్నయెడల మ॥ రా॥ శ్రీ వెల్లాల సదాశివశాస్త్రి గారు వెలమవారినిగుఱించి యాంధ్రచరిత్ర విమర్శనము వ్రాయుచు నందు 226 పేజీలో మార్కండేయ పురాణములోనున్నట్టియు, నీచెట్టులచేఁ గల్పింపఁబడిన ప్రమాణమునకుఁ బ్రథమముననున్నట్టియు నగు " మహానంది ర్మహారాజో " అనుశ్లోకముఁ బ్రమాణముగానిచ్చి యున్నారుగదా! ఆశ్లోకముతరువాత శ్లోకములు వెలమవారినిగురించి వివరింపుచున్నచో వారేల నావిషయమును నిరూపింపరు. అందు వెలమ వారినిగుఱించి లేనికయేగాని వేఱుగాదు. వారేయుఁ నేల! కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ శాఖలవారి చరిత్రమును గుఱించి "యిదమిత్థమ" ని నిరూపించుటకు నిక్కాలంబున నెందఱెందఱెంతెంతయో పరిశోధనము చేయుచున్నారు. మార్కండేయ పురాణమిటుల వారిని గుఱించి చెప్పినచో వారందఱు వృథాపరిశోధనఁ జేయుటేల సంభవించును?

వేయేల!

మారనకవి మార్కండేయ పురాణమును దెనిగించి కమ్మకులఁజుండగు నాగయగన్న మంత్రికిఁ గృతినిచ్చి యుండెగదా! కమ్మకు



లక్షణ సంస్కృతగ్రంథమునను్నచో దానిమాతృకయగు తెనుఁగు మార్కండేయ పురాణంబున నాకవి యేలయుదాహరించియుండడు? యుదాహరింప కుండుటకు సంస్కృతగ్రంథమున నాకమ్మకులచరిత్రము లేకున్నదియేగాని వేఱుకారణముగాదు. కావున వీరిప్రమాణమును సత్కింభరత్వాసూయావేశములతోఁ గల్పించిరనుట ధ్రువంబు. అట్టి యసత్య కల్పనమున కీశ్వరుఁడు వీరికిఁ బాపఫలంబొసంగుటఁ ... నంబని నమ్మవచ్చును. వెలమ, రెడ్డి, కమ్మ, శాఖలవారి యుష్ప... ననుభవించుచు, వారిచేనొసంగబడిన యగ్రహారములచే సౌఖ్యంబనుభవించుచు, నందునకుఁ బ్రతిఫలముగా నీపీఠమువారు పైవారిననులోమ సంకరులఁ జేసినందులకు పీఠమువారికిఁ బ్రతిఫలము (పాపఫలము) నీశ్వరుఁడెట్లీయకుండును?

చదువరీ! ఈపీఠమువారి కెవరెవరగ్రహారము లిచ్చిరందువా? నర్సారావుపేట జమీందార్లగు మల్రాజువారు. అమరావతి పరిపాలకులగుఁ వాసిరెడ్డివారు. కాళహస్తి ప్రభువులీపీఠమువారికి నగ్రహారము లిచ్చిరి. పాపము! వాసిరెడ్డివారు తామిచ్చినయగ్రహారముతో సంకర జాతి కాకపోవుదుమనితలంచి కాఁబోలు చింతపండువులుసునకు మాన్యంబొసంగిరి. ఆమాన్యములతో నిప్పటికి పీఠమువారు నిత్యము చింతపండుపచ్చడి లేకయుండజాలరు. ఈవిధిని నీపీఠపోషణమునకుఁదగు సౌకర్యము లొసంగినవారలలోఁ గాళహస్తి ప్రభువు లగ్రగణ్యులు. అందుచేఁగాఁబోలు ప్రభువులనుగురించి దాముగష్టపడి సంపాదించుకొన్నట్టి కల్పితానులోమసంకర ప్రమాణమున విమత్సరాఖ్యం పుత్రం నందరాజో మహాబలః పెన్నానదీతీర దేశ రాజానం కారయిష్యతిపుత్రం

వెలమనామానం ధీరం నందోమహీపతిః శ్రీకాళహస్తిదేశేతు రాజా
నం కారయిష్యతి-అని కాళహస్తి ప్రభువర్యుల గుఱించి తెటతెల్లముగా
నిరూపించియున్నారు.

యింతేదనుక వ్రాయువరకు తెనాలినివాసులు బ్ర॥ బండ్లము
గురునాథశాస్త్రిలుగారు "శాస్త్రీయోపన్యాస మనుపేరుతో "పు
ష్పగిరి పీఠమువారు కల్పించిన వాదప్రతివాదనలపై పీఠమువారివా
నల కనుకూలముగా వ్రాసినపుస్తకము నాకందినది అందు 33-3
పేజీలలో "అయితే మార్కండేయోత్తర పురాణభాగమునీ వాది ప్ర
వాదులెటుల సంపాదించిరో తెలియకున్నది.

"నప్తమం నారదీయంచ మార్కండేయంతతః పరం ఇత్యాది
శ్లోకములచే సూతసంహితా ప్రథమాధ్యాయములోఁ జెప్పఁబడిన మహా
పురాణసంఖ్యలో మార్కండేయపురాణమని మాత్రమున్నదిగాని
శ్రీభాగవత దశమస్కంధ శ్రీకూర్మపురాణములకువలె దీనికిఁ బూర్వో
త్తర భాగములున్నట్లు కన్పట్టదు. మార్కండేయ పురాణము 139
అధ్యాయములు గలిగియున్నది. పిమ్మట పురాణపఠన శ్రవణాదిఫలము
జెప్పఁబడి సమాప్తినొందింపఁబడినది, ఉపపురాణములలోనుండు నందు
రా? "అద్యం సనత్కుమారేణ" ఇత్యాది శ్లోకములచేఁ జెప్పఁబడిన
పురాణసంఖ్యలోఁగూడ నెక్కడను చేర్చియుండలేదు. కనుక నెట్లు ప్ర
మాణ్యమంగీకరించివాది ప్రతివాదులు స్వపక్షమును సాధింపఁబూను
కొనిరో తోఁచకున్నది "అని వ్రాసినారు మార్కండేయోత్తర పురాణ
మే లేదని చెప్పినపుడు మార్కండేయోత్తర పురాణములోని వచనమె
టులుండునో చదువరులూహింతురుగాక. లేక "మార్కండేయోత్త



రాణమనునది పొరఁబాటు. మార్కండేయ పురాణమేయనిన మా
డేయపురాణంబున నీవిషయముఁజూపఁ బీఠమువారే కర్తలు. అట్లు
చూపఁజాలనపుడు నిందాజనకముగఁ గల్పించినందులకు దగు ప్రతిఫలమొ
సంగ సర్వేశ్వరుడు. రాజ్యాంగమువారు. భారతీయులు కర్తలు.

7 వ పేరాలో "బ్రాహ్మణులఁ బూజించుచు ధర్మ విరోధుల
నిగ్రహించుచు, వర్తించుట ద్విజశుశ్రూషయనియు చెప్పఁబడు" నని
వైదికధర్మమతమెరుగక యవ్యక్తముగా వ్రాసినారు, ఇందులకు నాలు
గవ పేరాలో నియ్యఁబడిన జవాబుచాలును. కాని యీ కమ్మ, రెడ్డి
మున్నగువారి రాజ్యపరిపాలనముకంటె వీరుక్షత్రియులని బ్రాహ్మణు
లచే నెన్నఁబడువారి రాజ్యపాలనము బ్రాహ్మణులకు వ్యతిరేకముగా
నున్నదా? ఆయుభయులు బ్రాహ్మణ వర్ణమునకు సమానగౌరవముని
చ్చిరిగాని యొకరు పూజించి వేఱొకరు తృణీకరింపలేదు. ఈనానుడికి
భేదమున్నచో నిరూపింపుమని కోరుచున్నాను.

8 వ పేరాలో "గోత్రముల నిప్పుడేర్పాటుచేసికొనుమనుట
న్యాయ్యముగాదు. క్షత్రియత్వము సిద్ధించినతరువాత గదా యూవిచార
ణము చేయవలెను. క్షత్రియత్వమే లేనటుల గన్పట్టుచుండఁగా స్వేచ్ఛ
మెయి శాస్త్రాధారములేక గోత్రముల గల్పించుకొనినయెడల కల్పిత
గోత్రములను వలెనే నిష్టములేనపుడు విడువవచ్చును. ఏయాధారము
లేక నిష్టమువచ్చినటుల గోత్రకల్పనముచేసికొనుటకు శాస్త్రమంగీకరిం
పదు శాస్త్రములేకయే చేసినపని బాలక్రీడయగును. ఫలమీని
యును. అనర్థకమువచ్చును. అగ్నిపురాణమున క్షత్రియ, శూద్రులకు
పురోహిత గోత్రములుండునని చెప్పఁబడినది. క్షత్రియ వైశ్యశూద్రా

ణాం గోత్రంచప్రవరాదికం తథాన్యసంకరాణాంచ యేగాంవిప్రస్య యాజకాః క్షత్రియ వైశ్య శూద్రులకును, సంకీర్ణులకును, పురోహిత గోత్రములుండునని చెప్పఁబడినది. గాని యట్టి నియతపురోహితులు వీరికిలేరు. ఇదిగాక బ్రాహ్మణులు ద్రోహముచేసిరని వీరెంచెదరు. ఇట్టి వీరిగోత్రములును కమ్మవారికసహ్యములే గనుక పురోహిత గోత్రములఁ బెట్టుకొనుటయు సంభవింపదు." అనివ్రాసిరి.

గోత్రములు మార్పఁగూడనటులైన ముద్గలుని తండ్రి గోత్రమును ముద్గలుని పుత్రులు తద్వంశీయులును చెప్పుకొనరా? మార్పుటకు మతమంగీకరించుటచేతనే ముద్గలుని వంశీయులు ముద్గల గోత్రముఁ బెట్టుకొనిరి. ఇంతయేల: ఈయవ్యక్తులును పౌరోహితుని గోత్రమును క్షత్రియ వైశ్య శూద్రులు ధరింపవలయునని చెప్పిరిగదా? ఒక పురోహిత్యగోత్రముగల వంశము పురోహితునిచేఁ దన పౌరోహిత్యముఁజేయించుకొనక మఱియొక పురోహితుని నేర్పఱచుకొనినచో నాపూర్వ పౌరోహిత్యగోత్రమును మార్చుకొనవలసినదేగదా! విశ్వామిత్ర గోత్రము మధ్యనేగదా బయలుదేరినది. గోత్రముమార్పరాదనుటయెట్లొప్పియుండును? మార్చుటకేయభ్యంతరముండదుగాని యామార్చుటలో వీరిచేఁజెప్పబడినటులఁ బౌరోహితగోత్రము మాత్రము ధరింపరాదు. గోత్రములుబుట్టిన కారణమరయలేక ఋషిగోత్రముల బెట్టుకొనిన గౌరవము లేకపోవుటయేగాక యగౌరవముఁగూడ దప్పక కల్గును.

గోత్రములు మూలపురుషునిఁ దెలియఁజేయుటకుఁ బుట్టినవని తెలియుచున్నది. వసిష్ఠగోత్రమనఁగా వశిష్ఠవంశమని యర్థము. ఆవంశమునకు వసిష్ఠుఁడు మూలపురుషుఁడని భావము. అటులనే ముద్గల గోత్రమనఁగా ముద్గలుని వంశము. కాఁబట్టి కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ శాఖలవారు మూలపురుషుని నామమును గోత్రముగా మార్చుకొనుట కేయభ్యంతరముండదు. వీరిచేఁ జెప్పఁబడినట్లు పురోహిత గోత్రమును రాజన్య వైశ్య శూద్రులు ధరింపవలసియున్నచో ధర్మరాజు ధౌమ్యుని పౌరోహితునిగా నేర్పరుచుకొనిన యనంతరమున ధౌమ్య గోత్రమునే ధరించియుండును గదా! ధర్మరాజానంతరము నేటివఱకు నెందఱో క్షత్రియులు రాజ్యపరిపాలనము చేయుచు పూర్వులవలె ఋషులనుగాక బ్రాహ్మణులఁ బౌరోహితులుగా నేర్పఱచుకొనిరి. కాని వారా పౌరోహితగోత్రమును ధరించినట్లు గనుపట్టదు.

నేఁడు రాజన్య వైశ్య శూద్రు లెవరైన నేకార్యమాచరింపఁబూనుకొనునపుడు తమ గోత్రమునే చెప్పుకొందురు గాని తమ పురోహితుని గోత్రమును జెప్పుకొనుట లేదుకదా! పై విషయము లరయఁ బౌరోహిత గోత్రమును రాజన్య వైశ్య శూద్రు లెవ్వరును ధరింపనవసరములేదని స్పష్టపడుచున్నది. కావున క్షత్రియ, వైశ్య, శూద్రులు పురోహిత గోత్రమును వీడి తమ మూలపురుషుల నామముతో గోత్రములు పెట్టుకొనుట సమంజసమని తోఁచుచున్నది.

9వ పేరాలో "చిరకాలమునుండియు, ఉపనయన వేదాధ్యయనములు లేనివారలిపు డుపనయన వేదాధ్యయనములు చేయుట న్యాయ్యముగాదు.' అనియు మూఁడు తరములు ఉపనయనాదులు లేనియెడల వారలకు పునరుపయనాధికారమే యుండదని స్మృతులలో

చెప్పఁబడినజనియు, నూరు సంవత్సరములనుండి ఉపనయనాదులు లేని కమ్మవారలు వాదముకొరకు 'క్షత్రియుల'ని యంగీకరించినను వారికి ఉపనయనాది సంస్కారము సంభవింపదు." అని వ్రాసినారు.

కమ్మవారికి నుపనయనాధి కారము లేని యెడల ఒడ్డెలు, శాలింగులు, పద్మసాలీలు, భట్టరాజులు మున్నగు వారల కెట్లుపనయనము జేయుచుండిరి. కాళహస్తి ప్రభుపర్యులగు వెలమవారికి నాగపుర ప్రాంతమునయున్న రెడ్డివారికి పూర్వమునుంచి యుపనయనము లెట్లు చేయుచుండిరి. ఇంతయేల ప్రతి శుభాశుభ కార్యములందును గమ్మవారికి జన్నిదములు ధరింపఁజేసిరే యాకార్యములఁ జేయించుచుండుట లేదా! నూరు సంవత్సరములనుండి వీరికుపనయనాధి కారములు లేవనుటెట్లు పొసగును? కమ్మవారివలెనే యిదివరకెన్నడు నేతరములో నుపనయన మెఱుగని శివాజీ చక్రవర్తికి నేబదివత్సరముల ప్రాయమునఁ బండితబృందమంతయుఁ జర్చించి యుపనయనము నెట్లుగావించినది? ఈవిషయము లన్నియు విచారింపఁ జాతుర్వర్ణ్యజులలో నఖిలాషముగల వారెవరైన నుపనయనములు గావించుకొనుటకు నేయాక్షేపణముయుండదని స్పష్టమగుచున్నది.

10వ పేరాలో "పరస్పర కలహములున్నను తమజాతివారిని "తమజాతివారుకార"ని యెవ్వరును చెప్పరు. కమ్మ రెడ్డిబలిజులు క్షత్రియులైన యెడల భోజన ప్రతిభోజనములు లేకపోయినను ప్రసిద్ధ క్షత్రియులు వీరిని క్షత్రియులని వాడెడివారలేను. అటుల వాడనందున వీరు క్షత్రియులుగారు" అని వ్రాసినారు.

"వైదికులు, నియోగులు, వైష్ణవులు మున్నగువారు బ్రాహ్మణులేయని యిపుడు వీరిచే వ్రాయఁబడినను వారిలో వారొకరొకరిని



"బ్రాహ్మణులుగార"ని కావించుకొనినకయ్యములను లోకమెఱింగియే యున్నది. అంత మాత్రముచే వారందఱును బ్రాహ్మణులు కాక పోయిరిగా? నేఁడెవ్వరినిఁ ప్రసిద్ధ క్షత్రియులని వీరము వారంగీకరించు చున్నారో! వారికిని నీకమ్మ, రెడ్డి, వెలమ, బలిజ శాఖలవారికిని సంబంధ బాంధవ్యములు పూర్వమున్నటుల శాసన చరిత్రాదులు దెల్పుచుండ వీరిని (కమ్మ మున్నగు)నెవ్వరో క్షత్రియులని పిలువలేదను నంత మాత్రమున శూద్రులనుట పొసగనేరదు.

అదియునుగాక వీరిని శూద్రేతర నామములగు కమ్మ, రెడ్డి, వెలమ, బలిజ నామములతో వీరినిఁ బిలుచుచుండిరి. గాని శూద్రులని పిలుచుటయు వ్యవహరించుటయుఁ గాని లేదుగదా! అట్లుండ శూద్రులనుటెట్లు చెల్లును.

యింతయేల కమ్మవారి చరిత్రమునందు "కమ్మవారును సూర్య వంశపు క్షత్రియులమనుకొను మందపాటి వారును, దాంట్లవారును, వత్సవాయవారును, ఒకే శాఖవారని సిద్ధాంత మొనర్పబడిన ప్రమాణములను వీరు విమర్శింపఁజాలక పోవుటచే వీరివ్రాఁత నిరాధారమని తేటతెల్లమగుచున్నది.

11వ పేరాలోని క్రియాశూన్యపు వ్రాతలను విమర్శింపఁబూని గ్రంథమును బెంచుటకంటె 'శారద' పత్రిక 2వ సంపుటము 1వ సంచిక యందు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు ప్రచురించిన రెండవ అమ్మరాజ విజయాదిత్యుని నూతన తామ్రశాసనములోని విమర్శనను జూడఁ గోరెదను.

12వ పేరాలోని "ఈహేతువులన్నియు దుర్బలములు గనుక అనాది కాలమునుండి వైశ్యులని వాడఁబడు సంఘముకంటె ముందు తీర్థ ప్రసాదాది గౌరముల నపేక్షించుట యుక్తముగాఁ గన్పించుట లేదు." అని వ్రాసినారు.

వీరిచే వ్రాయఁబడిన యీవిషయ మసూయావేశ పూరితమని చెప్పక చెప్పుచున్నది. నిరీక్షింపుడు. వైశ్యులనఁబడు కోమట్లకంటెఁ (కొల్లూరునందు) మాకుఁ తీర్థప్రసాదాది గౌరవము లనాదినుండియు ముందు జరుగుచుండగా నిప్పు డపేక్షింపరాదనుట యెట్లుండునో భారతీయులు నిరూపించెదరుగాక. కొల్లూరునం దీకుమతులు వైశ్యులకు గౌరవము ముందు జరిపిన విషయము నిరూపించెదరుగాక. లోకములోఁ గొన్నిచోటుల గౌరవము జరుగుచుండెననుట యాబాలగోపాల మెఱింగియే యున్నది. కావునఁ గుక్షింభరత్వముచే వీరిచే వ్రాయఁబడిన వ్రాఁతలు విశ్వసింపఁదగినవి కావని విశదమగుచున్నది.

13 వ పేరాలో "శ్రీశంకరులవారికి లోఁగడ బ్రాహ్మణాదివర్ణ విభాగంబులన్నియు నశించినవి. అందుచే అందరును బౌద్ధులైయుండిరనుట సరిగాదు. భట్టపాదులు, మండనపండితులు, ప్రభాకరుడు, శ్రీశంకరులు మొదలగు మహాపండితులాకాలముననుండినట్లును శ్రీశంకరులు సంచరించిన యన్నిదేశములలోను బ్రాహ్మణోత్తములుండినట్లును, శంకరవిజయమున గన్పట్టుచున్నది" అని క్రియాశూన్యముగా శంకరునకు పూర్వము వైదికమతమున్న ప్రమాణములను జూపలేక శంకరుని కాలముననున్న ప్రమాణములను జూపుటచే మావాదనకిసుమంతయు లోపములేదని నిరూపించుచున్నాను.



14 వ పేరాలో "భట్రాజులు వందిమాగధులు, వారుసంకీర్ణులు. వారికి మొదటినుండియు జన్నిదములుండి యుండవచ్చును. వారికిని వేదోక్త కర్మలులేవు. ఋషిగోత్రములును లేవు. ఒకవేళఋషిగోత్రములున్నను శూద్రులకును సంకీర్ణులకును పురోహితగోత్రములుండునని యగ్నిపురాణములోఁ జెప్పఁబడియున్నందున వారు సంకీర్ణ శూద్రేతరులనుటకు సంశయముండదు" అనివ్రాసినారు.

వీరనినట్లు భట్రాజులు వందిమాగధులుకావచ్చును. కాని సంకీర్ణులుమాత్రము గారనినొక్కి వక్కాణించుచున్నాము. వారికి ఋషిగోత్రములు నుపనయనాది ద్విజచిహ్నములుగలవనుట ప్రత్యక్షసిద్ధము. మఱియు వందిమాగధులచే నుతింపబడు "వీరుశూద్రులుగార" ని సిద్ధాంతమొనర్చుచున్నాను. శూద్రులకుజన్నిదములులేనట్లైన భట్రాజులు శూద్రులైనచో వారికెట్లు జన్నిదములుండెనో తెలుపవలయునని యీపుష్పగిరి పీఠపుసన్యాసినిఁ బ్రశ్నించుచున్నాను.

15 వ పేరాలో 'నియోగులు బ్రాహ్మణులేయనుటకు సంశయమేలేదు. పూర్వకాలపు గ్రంథములలోను వారుబ్రాహ్మణులనియే యుదహరింపఁబడినది కనుకవారు గౌరవార్థము రాజశబ్దమును ధరించిరని చెప్పవచ్చును. కాని "కమ్మవారు క్షత్రియులగుదురా కారా!" యని సంశయముగల్గినడు పూర్వరాజుల యుపనామములు, బిరుదులు, ఇప్పటికమ్మవారికి లేనందునను, ఇప్పటికమ్మవారు ధరించెడి నీడు, నాయుడు, చౌదరి యను పేర్లు పూర్వరాజులకు లేనందునను, యీకమ్మవారు క్షత్రియవంశస్థులనుట యుక్తముగా కన్పించదు" అని వ్రాసినారు.

నియోగులు బ్రాహ్మణులని చెప్పుటకు నేడీవాదనలో సంశయము లేకుండినదిగాంబోలు. నిన్న మొన్నటివరకు వైదికనియోగులకు జరిగిన వాదములు జగమెఱుంగనిదియా! ఆవిషయము మాకనవసరము. మేమెన్నడును ‹‹ నియోగులు బ్రాహ్మణులుగారని ’ తలంచి యుండలేదు. మేమెవరితోనైనం జెప్పియుండలేదు. ఈమావాదమునకైనను వైదికులు నియోగులు నొకటిగానున్న సంతసించెదము. “ రాజు ” యను నుపనామము కమ్మవారికి లేనందువలన క్షత్రియులు గానిచో నాయుడుపనామముగలవారు క్షత్రియులేనా ? అని ప్రశ్నించుచున్నాము.

కమ్మవారు వైదికమతము రాకపూర్వము నాయుడు, చౌదరి, రావుసీడు, అనునుపనామములులేక రాజులనియు, ప్రభువులనియు, మండలేశ్వరులనియు వ్యవహరింపఁబడుచున్నటుల నంత్యమున నుదహరింపఁబడిన చాటుపద్యములే ఘోషించుచున్నవి. ఈ వైదికమాహాత్మ్యముచే చౌదరి మొదలగు నుపనామములు గల్గినను, అవియు క్షత్రియ చిహ్నములే కానిశూద్రచిహ్నములుగావని లోకమెఱుఁగును.

కల్పితోభయవాద సంగ్రహ విమర్శనము

సంపూర్ణము.

# శాస్త్రియోపన్యాస విమర్శనము.

పుష్పగిరి పీఠమువారు తాము అచ్చొత్తించిన పుస్తకము ఒకదానిని తెనాలి వాస్తవ్యులగు బ్ర॥ బండ్లమూడి గురునాథశాస్త్రిగారికి పంప వారు దానినిబట్టి శాస్త్రియోపన్యాస మను పేరుతో తమ కనుకూలముగా నొకపుస్తకమును అచ్చు వేయించి యున్నారు. ఆగ్రంథమున గల విషయములలో కొన్ని యిదివరకే విమర్శింపబడి యున్నందున మిగత విషయములు విమర్శించెదము. ఈశాస్త్రిగారు ‹బ్రాహ్మణోస్యముఖ మాసేత్’ అను ఋక్కు ననుసరించి పుట్టుకచే వర్ణవిభాగంబని సాధింప జూచుచున్నారు. దీనిని గురించి మనమిదివరకు విమర్శించి యున్నందున యిట విమర్శనమాని యొకప్రశ్న వేయుచున్నాను. శాస్త్రులుగారు ‹ బ్రాహ్మణోస్య ’ అను ఋక్కునందున్న ‹బాహూరాజన్యకృతః’ అను వాక్యమునకు రాజన్యులు భుజములందు బుట్టిరను నర్థము చెప్పునెడల క్షత్రియ వర్ణమునకాదిపురుషులని మీచే జెప్పబడు సూర్య చంద్రులు భుజములందు బుట్టినగదా యీసూర్యచంద్ర వంశజులు క్షత్రియులగునది. ఆసూర్య చంద్రులు భుజములందు బుట్టలేదని ‹‹ బ్రాహ్మణోస్య ” అను ఋక్కు తరువాత ఋక్కు “చంద్రమామనసో జాతశ్చక్షోస్సూర్య అజాయత” అని చెప్పుచున్నదే యీస్వవచన విఘాతమును సవరించుటెట్లు.

5, 6వ పేజీలలో (అక్లైనయెడల మహాభారతములో, 'శాంతి పర్వములో భృగు భరద్వాజ సంవాదములో అసృజద్బ్రాహ్మణానేవ పూర్వం బ్రహ్మప్రజాపతిన్, ఇది మొదలు అధ్యాయాంతరమువరకు

అనగా సృష్టిలో మొదట బ్రాహ్మణులనే సృజించినందున వర్ణ భేదము లేదనియు, పిమ్మట కర్మలచే గలిగినదనియు వారలే స్వధర్మములను వదలి కామభోగాద్యాసక్తులై యున్నందున క్షత్రియులైరనియు గోపోషణ కృషి కర్మాదులవలన జీవించుటచే వైశ్యులయిరనియు, శౌచము లేక హింసానృతాద్యాసక్తులై యున్నందున శూద్రులయిరనియు, వీరలకు యజ్ఞ క్రియాదులు నిషేధింపబడవనియు, చేసిన భృగూపదేశ మెట్లు శాస్త్రీయమగు నంటిరేని చెప్పెదము సావధాన మనస్కులై శ్రుతి స్మృతులకనిరుద్ధముగ పూర్వోత్తర గ్రంథ సందర్భముం గని పెట్టుచు చిత్తగింపుడు. గ్రంథమున కపార్థముం జెప్పకుండుడు.

ఈయధ్యాయారంభమునందు భరద్వాజ మహర్షికి భృగు మహర్షి 'అసృజద్బ్రాహ్మణానేవం పూర్వం బ్రహ్మప్రజాపతీన్। ఆత్మతేజోభి నిర్వృత్తాన్ భాస్కరాగ్నిసమప్రభాన్॥ తతస్సత్యంచధర్మంచ తపో బ్రహ్మచశాశ్వతం ఆచారం చైవశౌచంచస్వర్గాయవిదధేప్రభుః॥

ఇట్లు నయిదు శ్లోకములచే సృష్టికర్త సృష్ట్యాదియందు సూర్యాగ్నులవలె స్వాభావిక తేజోవంతులును బ్రహ్మవేత్తలునగు ప్రజాపతులను సృజించి పిమ్మట లోకోపకారము నుద్దేశించి యభ్యుదయ ఫలముకొరకు సత్య ధర్మ తపో వేద శౌచారములను గల్గించి దేవదానవ చాతుర్వర్ణ్యాది సృష్టిచేసిన పిమ్మట నావర్ణములవారికి శ్వేతరక్త పీత కృష్ణవర్ణములం గ్రమముగ గలిగించెనని చెప్పె.

ఈగ్రంథము మనుస్మృతి ప్రథమాధ్యాయములో 34 శ్లోకము మొదలు 'అహంప్రజాస్సిసృక్షుస్తు తపస్తప్త్వాసుదుశ్చరం। పతీన్ప్రజా



నామసృజన్ మహర్షీనాదితో దశ॥ మరీచి మత్ర్యంగిరసౌపులస్త్యంపులహంక్రతుం ప్రచేతసంవసిష్టంచ భృగుంనారదమేవచ॥

ఇట్లారంభించి 'ఏవదంతాస్తుగతయో బ్రహ్మద్యాస్నము దాహృతాః, ఈశ్లోకమువరకు నున్న గ్రంథముతో సంవాద నొందియున్నది. ఇదిగాక శ్రీమద్భగవత్పాదులు తమ గీతాభాష్యావతరణ గ్రంథారంభమునందు 'సభగవాన్ సృష్ట్వేదం జగత్ తస్యచస్థితిన్ చికీర్షుః మరీచ్యాదన్ అగ్రేసృష్ట్వా ప్రజాపతీన్ ప్రవృత్తి లక్షణాధర్మం గ్రాహయామాసవేదోక్తం' అని చెప్పియున్నారు. గనుక తదుత్తర కార్యనిర్వాహకులును, బ్రహ్మవేత్తలునగు ప్రజాపతులను సృజించినట్లు, 'బ్రాహ్మణోస్యముఖమాసీత్, మరీచి మత్ర్యాంగిరసాదిత్యాది శ్రుతిస్మృత్యను సారముగా నుత్తర గ్రంథమంతయు చాతుర్వర్ణ్యాది సృష్టినే చెప్పియున్నది గాని తద్విరుద్ధముగా బ్రాహ్మణులనే సృజించెనని చెప్పియుండ లేదు

అవి గుణకర్మల చేతనే వర్ణవిభాగంబను ప్రమాణంబులను ముందు గన్పరచి పుట్టుకచేత వర్ణవిభాగంబై యున్నపుడు యాప్రమాణము లటులచెప్పుటకు గల కారణములను జూపక ఏవో మరికొన్ని పుట్టుకచేత వర్ణవిభాగంబను ప్రమాణములను జూపిరి. ఇటులనే వివిధానుకూలమగు ప్రమాణములను వ్రాయుచు 10వ పేజీలో వేదవ్యాసులు శాంతిలో నొకతీరు, అను శాసనికములో మరియొక రీతి అనగా సృష్టిలో వర్ణభేదము లేదనియు, వర్ణభేదము నైసర్గికమనియు చెప్పినారని చెప్పెదమంటిరా? అన్యాయముగదా? అట్లయిన మొదల నీయధ్యాయములోనే చివరకు అని వ్రాసి 'బ్రాహ్మణోవాప్యసద్వృత్తస్సర్వ

సంకరభోరజస్క” అను 47వ శ్లోకము మొదలు “బ్రాహ్మస్వభావ కల్యాణి!” అను 52వ శ్లోకమువరకు గల శ్లోకముల నుదహరించియుందు లకు వ్యాఖ్యానముగా 11వ పేజీలో ఇత్యాది గ్రంథము బ్రాహ్మణు డు అసద్వృత్తి గలవాడైతే శూద్రుడవును. శూద్రుడు సద్వృత్తిగల వాడైన బ్రాహ్మణుడవును. అని స్పష్టముగా బోధించుచున్నదిగదా! ఎట్లు సమర్థించెదరనిన చెప్పెదము. ఇదియంతయు సద్వృత్తి స్థాపకము “సద్వృత్తం ప్రశస్తం నయోని సంస్కారాదయః” అని చెప్పి సద్వృత్తి యందు జనులను ప్రవర్తింపఁజేయుటకుగాని యోనిసంస్కారాదులను నిషేధించుటకాదు. అనికనుక నాగ్రంథమంతయు సద్వృత్తి ప్రశంసా తాత్పర్యకము గనుక ప్రశంసార్థవాదముని గ్రహించుటెటులనో యూ హింపుడు. 6వ పేజీలోని ప్రమాణములను బట్టి సృష్టికర్త ప్రథమ మున దశ ప్రజాపతులనుగ సృష్టించి పిమ్మట చాతుర్వర్ణ సృష్టిచేసి నటుల శాస్త్రిలుగారు వ్యాఖ్యానముచేయుట జూడ పుట్టుకచే వర్ణ విభాగంబను సూచన యిసుమంతయు గన్పడుటలేదు. ఐతే మానవలోకమును సృజించినది ప్రజాపతులో లేక సృష్టికర్తయో శాస్త్రుల్లుగారు వివరింపలేదు. మానవ సముదాయము లేనిది చాతు ర్వర్ణము లుండవుగదా.

ఆమానవ లోకము ప్రజాపతులవలన గలిగిన పుట్టుకచే వర్ణ విభాగంబను చట్టము ననుసరించి కశ్యపుని సంతతి యంతయు కశ్యపుడు పుట్టిన వర్ణము కావలసినదేగదా? అటులనే పులస్త్య సంతతియంత యు నాతని వర్ణము కావలసినదేగదా. ఇటులనే యేప్రజాపతి సంతతి యాప్రజాపతియొక్క వర్ణమేనా? అటులఁగాదని భాగవతాది పురా



ణములు సయితము వచింపుచున్నవే లేక సృష్టికర్తవలన మానవ లోకము గలిగిన, నట్లు సృష్టికర్తయొక్క ముఖబాహూరు పాదముల యందుఁ గలిగిన వ్యక్తులయొక్క యాహ్వయము లేవియో తెలుప శాస్త్రిలుగారే బాధ్యులు. పోనీ ప్రజాపతులే ముఖ[illegible]ు పాద ములందుఁ గలిగెనందురా? ఆప్రజాపతులలో స[illegible]వయవము నుండి యుద్భవించిరో యేప్రజాపతికి బ్రాహ్మణులు బుట్టిరో యిటులనే యేయే ప్రజాపతికి క్షత్రియ, వైశ్య, శూద్రులు బుట్టిరో తెలుపమని శాస్త్రిలగారిని వేడుచున్నాను. శాస్త్రిలుగారు కేవలము కువాదన పరులవలెఁగాక కొంతవరకు సత్యమును వెల్లడిఁజేసినారు. ఎటులందు రా? వినుఁడు. ఇవ్విధిని వర్ణవిభాగమును గుఱించి యుభయవాదుల కనుకూలమగు ప్రమాణములున్నది నిజమని శాస్త్రిలుగా రొప్పుకొ న్నారు. మఱియు 16, 17వ పేజీలలోఁ బ్రథమమున వర్ణవిభాగము గుణకర్మలచేననియు బిమ్మట పుట్టుకచేననియు లిఖించినారు. దీనిని బట్టిఁజూడఁ బుటుకచే వర్ణవిభాగముగా మార్పుఁజేయు కాలమున నం దుల కనువగు ప్రమాణములను గల్పించి యదివరకు గుణకర్మలచే వర్ణ విభాగంబని నిరూపించు గ్రంథములలో నిఱికించిరి. అందుచే వ్యాసాదు లచే రచింపఁబడిన గ్రంథాదులలో సయితము ఈయుభయ వాదులకు ననుకూలములగు ప్రమాణములు లభించుచున్నవి. 13వ పేజీలో ముందు చాతుర్వర్ణ్యము సృష్టింపఁబడకున్న యెడల నీస్వభావ గుణ కర్మలు దేనినాశ్రయించి యుండఁగలవనిన ప్రశ్నకు ముందు మానవ సముదాయ సృష్టిగలిగినందున త్రిగుణము లామానవ సముదాయము నాశ్రయించి యుండెననియు, నాగుణముల ననుసరించి వర్ణము లేర్ప

డెననియు "తపుఃశ్శూద్రే" యను శ్లోకము నొక్కి వక్కాణించుచు డెనని జవాబు చెప్పుచున్నాను.

శాస్త్రిలుగారు 17వ పేజీలో "సత్త్వము మొదలగు గుణ కము బ్రాహ్మణులకు నియతము. అట్టి గుణములు వీరికిని (ఋషభ కుమారులకు) గలిగి యుండుటచే జాతిచే క్షత్రియులైనను బ్రాహ్మ గుణములచే జాత్యుత్కర్షము నొందియున్నారు." అని వ్రాయుట జూడఁ బ్రథమమున గుణకర్మలచే వర్ణవిభాగంబనుట సిద్ధాంతంబగు న్నది. కావున నీవర్ణ విభాగమును గురించి వేఱు వ్యాఖ్యాన మనవ రము. ప్రస్తుతాచరణమును బట్టి, పుట్టుకచే వర్ణవిభాగంబని యాకా గోపాలను తెలిగియే యున్నది. కమ్మవారి చరిత్రమీ ద్వివిధముల ననుసరించి కమ్మవారి క్షత్రియత్వమును సిద్ధాంతముఁ జేయుచున్నది.

28వ పేజీలో "నిఘంటువులలోఁగాని ప్రాచీన కవులయొక్క ప్రబంధములలోఁ గాని యెక్కడను కూర్మపదభవము "కమ్మ" యని వ్రాసియుండలేదు. అని వ్రాసినారు. అయ్యది నిజమే. కాని యిప్పటికి వేయి వత్సరములకు పూర్వ మేగ్రంథమున కమ్మవారు శూద్రులని వ్రాసిరో శాస్త్రిలుగారు నిరూపింప కర్తలు.

28వ పేజీలో "పూర్వ కాలములోనుండు భూమండలేశ్వరులగు రెడ్డి, కమ్మ, వెలమ యిత్యాది భేదముచే వ్యవహరింపఁబడు పుణ్యమూర్తులగు మహాప్రభువు లందరును దేవబ్రాహ్మణభక్తి గలిగి వారి సేవాసత్కార పోషణాదులచే గౌరవించి కృపాపాత్రులగు చుండినందు వలన" అనియు వ్రాసి తమ స్వాతిశయమును గన్పరచిరి కాని మంత్రిత్వ, సేనానాయక పౌరోహిత్యాది సేవకత్వములు బ్రాహ్మణు



ప్రాపించి వెలమ, కమ్మ, రెడ్డి మహాప్రభువులఁ గొల్చి వారి కృపాపాత్రులై యగ్రహారాది మాన్యములు పొందిరిగాని యాప్రభువర్యులు బ్రాహ్మణుల కృప నెపుడును కోరియున్నది లేదని ప్రస్తుతమున్న యగ్రహారములే వచింపుచున్నవి.

34వ పేజీలో "విప్రకులకమల భాస్కరం, కమ్మ కులోద్భవం దిండిపండిత పుత్రం" అని యున్నదని వారు ప్రకటించియుండిరే యీ దిండిపండిత పుత్రుఁడు కమ్మకులమందు విప్రకులమందు నెట్లు పుట్టెనో తెలియకున్నది అని వ్రాసినారు. కమ్మ కులజులగు జననీ జనకులకు జనించుటచేత కమ్మ కులమందుఁ బుట్టెననియు నప్పటికి గుణకర్మలచే వర్ణవిభాగమను నాచరణముండుటచే సిద్ధాంత మనుసరించి బ్రాహ్మణ గుణకర్మలు గలవాఁడగుటచే తను విప్రకులమందుఁ బుట్టెననియు వ్రాసిరని తెలుపుచున్నాను.

35వ పేజీలో, శ్రీశంకరాచార్యులవారు షణ్మతముల స్థాపించిరను ప్రమాణములను బట్టి వైదిక మతమిదివఱకే యున్నదని వ్రాసినారు. వైదికమతమదివఱకేయుండ వచ్చును కాని యాంధ్రదేశ ప్రభువర్యులగు వెలమ, కమ్మ, రెడ్డి, బలిజ శాఖలవారు వైదిక మత మవలంబించక బౌద్ధజైన మతముల నవలంబించి యుండి రందురు. ఆబౌద్ధ జైన మతములను రూపుమాపి వైదిక మతాభివృద్ధి గావించినది కుమారిల భట్టు శంకరాచార్యులు ఇందులకు దృష్టాంతరము.

"బౌద్ధ ధర్మము క్రమముగా నశింపజొచ్చె. ఆర్య క్షత్రియుల మనిపించుకొనఁగోరు రాజపుత్రులు హిందూమతమును బ్రాహ్మణులను పురోహితులను మిక్కిలి గౌరవించుచు వచ్చినందున హిందూమతము

ప్రబలి బౌద్ధమతము క్షీణించెను. 10వ శతాబ్దపరాంతమువరకు నీమతము ముక్కాలు మూడువీసము లీదేశమునుండి వెడలగొట్టబడియె. జైన మతమును తగ్గిపోయె. ఇట్టుల బౌద్ధజైన మతముల నడచిన శ్రేయస్సు కుమారిల భట్టు, శంకరాచార్యులు అను నీయుభయులకు నీయవలయును.

హిందూదేశ కథా సంగ్రహము, 6వ ప్రకరణము 186 పేజీ ఇవ్విధిని మతమార్పు గలుగుటచేతనే దుర్జయ కులాభరణులమని చెప్పుకొన్న వారిలో కాకతీయులు, సాగివంశమువారు నేను సూర్యవంశపు క్షత్రియులుగా బరిగణింపబడుటయు, కమ్మవారు ద్వంద్వార్థమగు చతుర్థాన్వయులను వాక్యముచే బేర్కొనబడుటయు, గలిగినదని కమ్మవారి చరిత్రమునందు విపులముగా వ్రాసి యున్నాను. ఈశాస్త్రి యోపన్యాసముగాని వీరమువారి వాద సంగ్రహముగాని కమ్మవారి చరిత్రమును విమర్శించి కమ్మవారు శూద్రులని క్రీస్తుశకము 10వ శతాబ్దమునకు పూర్వపు ప్రత్యక్ష ప్రమాణములతో సిద్ధాంత మొనర్ప లేక చేయు వికటవాదన విసర్జనీయమగుటచేతనే యారెండు ప్రతులు భవిష్యత్కాలమున దమవారు వాదించుట కనుకూలముగా నుండునని తలంచి గాబోలు తమకనుకూలురగు బ్రాహ్మణులకు మాత్రము పంచి పెట్టుచున్నారు. వీరిట్లుచేయుట యీశాఖలవారిని గుఱించియేగాదు. బ్రాహ్మణేతర శాఖలవారి నందఱిని గురించి యిట్టులనే నిందాజనకముగా సంకరులనియు సర్వాధికార శూన్యులనియు గల్పించి కయ్యము లొనరించుచున్నారు. వీరట్లు బ్రాహ్మణేతరుల ననధికారులజేసిన చర్యలలో కొన్ని పాఠకమహాశయుల యెదుట నుంచెద. పరిశీలింపుడు.

శాస్త్రియోపన్యాస విమర్శనము,
సంపూర్ణము.

:o:

శ్రీ

# బ్రాహ్మణేతర విజయము.

## — విప్రవిచేష్టితము —

సీ॥ వేదంబు శూద్రుండు • వినినంత జెవులలో
సీసంబు గరగించి • పోసినారు
జపమును శూద్రుండు • సలిపిన మాత్రాన
కంఠమ్ము నఱకించ • గలిగినారు
శాస్త్రంబు శూద్రుండు • చదువనారంభింప
దూరంబుగా బార • దోలినారు
కవిత శూద్రుండు సెప్ప • గా వినరాదంచు
నిర్బంధశాసనాల్ • నెఱపినారు

గీ॥ తల్లిరో యివె కృతయుగ • ధర్మములట
(పం) పలుకకుండగ దలదాల్చ • వలయునంట
బౌద్ధమణితోడ విప్రులే • బుట్టిరంట
అక్రమము చేసి బాగొందు • టవనిగలదె
భవ్య గుణసముపేత యో • భరతమాత.

బాలకవి కోసరాజు రాఘవయ్యా చౌదరి.

భరతమాత పుత్రులలో బ్రాహ్మణా బ్రాహ్మణులకు సంఘ హములు జనించుటకు మూలకారణంబెద్దియో యించుక విచా ము. భారతీయులు రాజ్యకాంక్షాపరులై నైకమత్యదూరులై య తఱి మహమ్మదీయులు వారిపైకి దాడివెడలిరి. ఆసమయంబున బ్రా ణేతరులు విద్యార్జనముమాని వైరుల నుక్కడగింప భుజ బలాభివృ నిరంతరము కృషిఁజేసి స్వదేశ మత సంరక్షణమునకుఁ దేరక్షి యత్నము చేయవలసినవారైరి. ఇక బ్రాహ్మణు లితర విషయము ననమర్థులైన కతన విద్యాసంపాదనమే ముఖ్య జీవనముగఁ జేసి యందు మిగులఁ జతురులై మెలగుచుండిరి.

అత్తఱి "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అను పురుషసూ ములోని ఋక్కునకు వికల్పార్థముఁ గల్పించి, పరబ్రహ్మముయొక్క ముఖబాహూరు పాదంబులనుండి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర లను నాలుగు జాతులవారు క్రమముగాఁ బుట్టిరనియు, నాచాతు ర్వర్ణములలో నేయే వర్ణములలోఁ బుట్టినవా రావర్ణము గలవారగు నియుఁ జెప్పి యందుకనువగు ప్రమాణములను మత గ్రంథముల నిరికించిరి. గుణకర్మలను బట్టి వర్ణవిభాగ మేర్పడినటులఁ బెక్కు పు ణములు చాటుచున్న సంగతి పండితులకుఁ దెలిసియే యున్నది. కొ గ్రంథ పరిశీలనమువలన వర్ణవిభాగ విషయమయి ద్వివిధమగు సిద్ధా ములుండునటులఁ దెల్లమగుచున్నది. ఆద్వివిధ సిద్ధాంతములలో జా గలుగు వర్ణమే యాథియను సిదాంతమునే యంగీకరింతమనిన నీచా ర్వర్ణ్యమువారి పూర్వులెవ్వరును పరబ్రహ్మవయవములనుండి నట్లు సరియగు ప్రమాణము లెందును గానరావు.



మఱియు బ్రాహ్మణుల కాదిపురుషులగు ఋషుల చరితముఁ దిలకించిన వారును బ్రహ్మ ముఖమునుండి పుట్టలేదని తెలియుచున్నది.

అదియుంగాక క్షత్రియుల కాదిపురుషులగు సూర్య చంద్రుల చరితము గాంచిన వారును బ్రహ్మ బాహువులనుండి పుట్టలేదని గోచరమగుచున్నది. పాపము! బ్రాహ్మణులట్లుచెప్పి యూరకుండినచోఁ గొంతవరకు సమంజసముగా నుండునేమో!

పరబ్రహ్మ బాహువులనుండి పుట్టిన క్షత్రియులు లేరనియే నుడువుచున్నారు. భాగవతము నవమస్కంధమున "ఇక్ష్వాకూణామయం వంశస్సుమిత్రాంతో భవిష్యతి, యత స్తంప్రాప్య రాజానంసంస్థాంప్రాప్స్యతి వైకలౌ" (అనఁగా) సూర్యవంశము సుమిత్రుడంతముగ నశించిపోవును. దేవాపియను శంతనుని తమ్ముఁడు కలాప గ్రామంబున యోగబలమునను౦డి తిరిగి కృతయుగాదిని క్షత్రియ వంశమును స్థాపించునని చెప్పఁబడినది. మఱియు విష్ణు పురాణమున భాగవత ద్వాదశ స్కంధమున నటులనే జెప్పఁబడినది. కృతయుగాది యనుటవలనఁ గలియుగమున క్షత్రియ వంశము లేదనియే వారి భావము. అందున కుపబలముగఁ బ్రస్తుతము క్షత్రియులని పిలువఁబడెడువారు పరశురాముని చే క్షత్రియ పురుషులు హతులుకాఁగా బ్రాహ్మణులవలన క్షత్రియ స్త్రీలకుఁ గలిగినవారని చెప్పుచుండిరి. శూద్ర కమలాకర స్మృతియందు "ఆదిఅంత్య జాతులు తప్ప తక్కిన జాతులులేవ"ని నిరూపించిరి.

"మహానందికి శూద్రస్త్రీ గర్భంబున నతిబలశాలి యయిన మహాపద్మపతి యను నందనుడుదయించు నతనితో క్షత్రియ వంశం

బడంగిపోఁగల దాసమయంబున నరపతులు శూద్రప్రాయులై ధర్మవి హీనులయి తిరుగుచుండ మహాపద్మునకు సుమాల్యుండాదిగాఁగ యెనమండ్రు కుమారు లుదయించెదరు వారు నూరు సంవత్సరము క్షోణీతలంబేలెద రంతటఁ గార్మ్యకుండు మొదలుగా రాజనవకంబు దాఖ్యులంజనియించు నాసవనందుల నొక భూసురోత్తముం డున్మూ నంబుసేయు."...భాగవతము ద్వాదశస్కంధము. పై విషయ బులంబట్టి కలియుగమున క్షత్రియులు లేరని తెల్లమగుచున్నదిగదా!

ఒకచోట క్షత్రియులు బాహువులనుండి పుట్టిరనియు వేఱొ చోట వేఱొక విధముగాఁ బుట్టిరనియు నింకొకచోట లేరనియే చెప్పె స్వవచన వ్యాఘాత దోషములెట్లు భాసిల్లుచున్నవో చదువరులె యూహింతురుగాక.

వెలమ, బలిజ, రెడ్డి, కమ్మాపనామ క్షత్రియ ప్రవరుల గురించి క్షత్రియునివలన శూద్ర స్త్రీయందుఁ బుట్టినవారు అనులోమ సంకరులని పుష్పగిరి పీఠమువారిపుడు నూతనముగాఁ గల్పించిన స గతి గతవాదమున విశదమైయే యున్నది.

ఇఁక వైశ్యులను గురించి యొక వింతకథ చెప్పుచుండిరి. ఇయ్య ది యే గ్రంథమున నున్నది తెలిసికొనుట దుర్ఘటము. కథమాత్ర మి దుఁ బొందుపఱచెద.

విప్రుఁడొకఁ డొకమాతంగ కన్యకను బగలు మహిషమ రాత్రి కన్యకనుగాఁ జేయుచు దానితోఁ గ్రీడలందేలుచుండఁ గొంత కాలములకామాతంగ వధూమణి కేవురు పుత్రులు జనించిరి. కొన్ని దినములామాతంగ నారినిని బగలు మహిషముగాఁ జేయుచు నాపు



త్రులచే దానినిఁ బోషింపఁ జేయుచుండెను. అట్లాపుత్రులు స్త్రీరూప ముగల తమతల్లినిఁ గాంచుచుఁ బగలు మహిషమును వీక్షించ ట్లు బగలు తమతల్లి గనఁబడకుండుటను విచారించి యామహి షగలు తమ మాతను మ్రింగి రాత్రి విడుచుచున్నదని యెంచి షమును బిలుకుమార్చిన రాత్రింబవలును తమ మాతయుండునని తలంచి యట్లు గావించిరి. విప్రుడది చూచి యామహిషముయొక్క మేయవయవము కడనున్న వారాయవయవ నామగోత్రములు గలిగి యుందునట్లు, వైశ్య వృత్తిచే జీవించునట్లు, వివాహాది శుభకార్యము లకు ముందావిషయమును బంచమునికిఁ జెప్పి వానియింటనుండి తేఁబ డిన యన్నిపాత్రములతో నాశుభ కార్యములను నిర్వహించుకొను నట్లును, వారికి శాపంబొసంగెను. అట్లు శాపదగ్ధులైన వారే కోమట్ల యియు, వీరికి వేదోక్త కర్మాధికారము లేదనియుఁ జెప్పుచుండిరి. ఈ బ్రాహ్మణ వివాదమును సిద్ధాంతముని యొప్పుకొనినచో బ్రాహ్మణులు దక్క తక్కినవారందరును శూద్రులని యొప్పుకొనక తప్పదు. ఇవ్విధిని బ్రాహ్మణేతరులందరును శూద్రులనుగాఁ బరిగణనఁజేసి దయతో విడి చినఁ గొంతమేలుగా నుండెడిదియే. అట్లుగాక యధోగతిపాలుచేయు తలంపుతో బ్రాహ్మణేతరు లందరును సంకరులని వికట ప్రమాణము లను గల్పించిరి. వీరిచేఁ గల్పింపఁబడిన సంకరముపైఁ గొంతవఱకు సిద్ధవటిలో వివరణము సల్పియుంటిని. కొదువ విషయము నిందు విశద పఱచఁ దలంచితిని.

## సంకరత్వము.

శివార్చకులను తంబళులను గురించి చిన్న ప్రవాద ముండు గలదు. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణ కన్యకనుంపుడు కత్తెగాఁ బట్టి

హింప వారికిఁగల్గు సంతతివారు శివార్చకులైరని యప్పయదీక్షిత కృత తాంత్రిక మీమాంస, స్మృతిరత్నాకరాది గ్రంథములలో వ్రాసిరి. నంబివారని పిలువఁబడు వైఖానసులు బ్రాహ్మణునివలన క్షత్రియ స్త్రీ యందు జన్మించినవారని స్మృతి ముక్తాఫలమని గ్రంథమునఁ జెప్పిరి భట్రాజులను వందిమాగధులని పిలచెదరు.

స్మృత్యంతరమందు, "క్షత్రియామాగధం వైశ్యాజ్జన యామాస వైసుతమ్। నవందీ జన ఇత్యుక్తో వ్రతబంధ వివర్జితః। శూద్రేభ్యోభ్యధికః కించిత్తస్య జీవనముచ్యతే। కావ్యాలంకార గద్యాది పద్యాభ్యాసకలాక్షమః గద్యపద్యాది చిత్రాణి విరుద్ధాని మహీభృతామ్। క్షత్రియాయాంవైశ్యజాతః క్షత్తా వేత్రధరో భవేత్" అని చెప్పఁబడినది. (అనఁగా) క్షత్రియ స్త్రీయందు వైశ్యునివలనఁ బుట్టినవాఁడు మాగధుఁడనఁబడును. (అనఁగా వందిజనుఁడు) వానికుపనయనాదులు లేవు. వాఁడు శూద్రునికంటెఁ గొంచెము త్తముఁడు. కావ్యాలంకార గద్యాదులునేర్చి పద్యాభ్యాసపాండిత్యము గడించి రాజులకు విరుద్ధముగు గద్యపద్యాదుల బఠించుచు వేత్రము ధరించి సేవజేయును. వీడే క్షత్తయనఁబడును. లఘుజాతి వివేకమందు "సుతాస్తేయే పురాణస్థాను చ్చరంతి నృపాన్సదా। యేఽల్పకాలగతాన్ శూరాన్ వర్ణయంతిచ మాగధాః। వర్తమానాం స్తథాసమ్యఙ్నృపాన్ సంగ్రామకారిణః। వర్ణయంతి ప్రబంధైర్యే వందినస్తే ప్రకీర్తితాః" (అనఁగా) సూతులను వారు పురాణములందున్న ప్రాచీన నృపుల వర్ణింతురు. వందులు ప్రస్తుతమందు యుద్ధములు సేయు నృపులఁ బ్రబంధములచే వర్ణింతురు.



కాయస్థులను గురించి:—

"మాహిష్య వనితాసూనుం వైదేహాద్యం ప్రసూయతే। స కాయస్థ ఇతిప్రోక్త స్తస్యకార్యం విధీయతే" మానువచనము—క్షత్రి[illegible]ని వలన వైశ్య స్త్రీయందుఁ బుట్టినది మాహిష్య యనంబడు. విప్ర స్త్రీయందు వైశ్యునివలనఁ బుట్టువాఁడు వైదేహుఁడు. వానికి మాహిష్యయందుఁ బుట్టువాఁడు కాయస్థుడనఁబడును.

చాకలిని గురించి:—

"ఉగ్రజాతంతు వైదేహ్యాం మఃజాపఁరజకంవిదుః। వహేత్తైల యంత్రము త్తమాశ్చాంత్య జాతితః। తైలహింపాయంత్రరవాకర్షణాత్ పాపసంభవః। అతో మాకలికోనిత్యం। నిర్వాసాస్సగరాద్బహిః॥

శూద్ర కమలాకరము. ఉగ్రునివలనఁ శారసవస్త్రీయందు బుట్టినవాఁడు మాకలి. (అనఁగా) తిలఘాతకుఁడును రజకుఁడనఁబడును. "చాకలి" వర్ణములకు హీనుడు. అంత్యజులకుఁ బ్రథముఁడు నగును. వస్త్రములను నుదుకుటయే వానికి వృత్తి

జలకడుగువాళ్లను గురించి:—

"జాతో మైత్రేయ శుక్లేన జాంధికాయాంస్వయంసుతః। అసౌ బంధులసంజ్ఞోత్ర అధమస్సర్వజాతిషు। సువర్ణకారవిపణే ధూల్యాంహేమాదిపశ్యతి" (అనఁగా) మైత్రేయునివలన జాంధిక స్త్రీయందు బుట్టినవాఁడు బంధిలుడనంబడు. (అనఁగా జలకడుగువాఁడు) కంసాలుల కుంపటిలో బుగ్గిగడగి స్వర్ణము వెండి మొదలగునవి తీయు వ్యాపారము.

గొల్లలను గురించి:—

శ్లో॥ క్షత్రియాచ్ఛూద్రకన్యాయాం సుతోజాయతే నామతః। సగోపాలఇతిజ్ఞేయో భోజ్యోవిప్రైర్నసంశయః॥

పరాశర స్మృతి అ॥ శ్లో. 23.

(అనఁగా) క్షత్రియునివలన శూద్రస్త్రీకిఁ బుట్టినవాఁడు గొల్లవాడనఁబడును. అతనియింట బ్రాహ్మణాదులు భుజింప వచ్చుననియుఁ దాత్పర్యము.

మంగలిని గురించి:—

శ్లో॥ శూద్రకన్యాసముత్పన్నో బ్రాహ్మణేనతుసంస్కృతః। సంస్కారాత్తుభవేద్దాస అసంస్కారాత్తు నాపితః॥ పరాశర స్మృతి అ॥ శ్లో. 22. (అనఁగా) శూద్ర స్త్రీయందు బ్రాహ్మణునివలనఁ బుట్టి దశ కర్మలచే సంస్కరింపఁబడినవాఁడు దాసుడనియు అటులనే పుట్టి సంస్కరింపబడని వాడు నాపితుఁడనియు దాని తాత్పర్యము.

మాల మాదిగలను గురించి:—

శ్లో॥ శూద్రాదాయోగవః క్షత్తాచండాలశ్చాధమో నృణాం। వైశ్య రాజన్య విప్రాసుజాయంతే వర్ణసంకరాః॥ మనుస్మృతి: దశమాధ్యాయము 12 శ్లో. శూద్రునివలన - క్రమముగా వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణ స్త్రీలయందుఁ బొడమినవారయి ఆయోగవుఁడు క్షత్త మనుష్యులలో నధముఁడగు చండాలుఁడును' వర్ణసాంకర్యమును జేసెడివారగుచున్నారు.



ఓడలు నడిపెడి నిషాదులు. బ్రాహ్మణునివలన శూద్రస్త్రీకి బుట్టినవారని మనుస్మృతి యందును వైశ్యునివలన బ్రాహ్మణ స్త్రీయందు గలిగినవాఁడు వైదేహుఁడనియు దానియందే చెప్పిరి. ఇటులనే బ్రాహ్మణేతర జాతులన్నియు సంకరములని గ్రంథములలో వచ్చుటచ్చట నిరీక్షించి సమయోచితముగా వానినాధారము జేసికొని యప్పుడప్పుడొక్కొక్క జాతితో వాదించుచున్నారు గాని యాప్రమాణములన్నియు నొకచోఁ జేర్చి పరిశీలించిన వారికి నయ్యవి స్వవచన వ్యాఘాతంబులతో నిండియుండిన మాయాకల్పితములని దర్పణము భాతి కన్పట్టును.

## సంకరత్వ విమర్శన.

వైశ్య స్త్రీకిని బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁడు, అంబష్ఠుఁడగునని యమరమునందుఁ జెప్పఁబడినది అటులనే బుట్టినవాఁడు అర్ధశీలియగునని పరాశర స్మృతియందుఁ జెప్పిరి. మఱియు ,,బ్రాహ్మణునివలన శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు నాపితుఁడ''ని పరాశర స్మృతిలోఁ జెప్పిరి. క్షత్రియునకు శూద్రస్త్రీయందుఁ బుట్టిన స్త్రీ ఉగ్ర యనఁబడును' దానియందు మాగధునకుఁ బుట్టినవాఁడు తలయు. గడ్డము క్షౌరము జేయువాడు నాపితుఁడనఁబడును,'అని శూద్రకమలాకరమునందుఁ జెప్పిరి. అంబష్ఠుఁడనినను నాపితుఁడనినను మంగలియనుట సుప్రసిద్ధముగదా? ఆ మంగలి బ్రాహ్మణునివలన వైశ్య స్త్రీయందు బుట్టినవాఁడని యొకచోటను, బ్రాహ్మణునివలన శూద్ర స్త్రీయందుఁ గల్గినవాఁడని వేరొకచోటను, ఉగ్రజాతి స్త్రీకి మాగధునకుఁ బుట్టినవాఁడని వఱియొకచోటను, చెప్పిన నయ్యది స్వవచనవ్యాఘాతమనుట కించుంతయు

సందియముండదు గదా? అదియునుంగాక యీమతము ననుసరించి శూద్ర స్త్రీయందు క్షత్రియునివలనం గల్గినవాండు ఉగ్రుండనియు పరాశర స్మృతిననుసరించి యిటులనే పుట్టినవారు గొల్లలనియు. పుష్పగిరి పీఠమువారి కల్పితముననుసరించి పైవిధముగ బుట్టినవారు. కమ్మ, రెడ్డి, వెలమ, మున్నగు శాఖలైరనియుం జెప్పెడి వచనమెంత సత్యమైనదో తేటతెల్లముగ గన్పడుచునే యున్నది.

మఱియు బ్రాహ్మణునివలన క్షత్రియ స్త్రీకిం గలిగినవాండు ఆత్మ నివేదకుండనంబడునని పరాశర స్మృతిలోం జెప్పిరి. అటులనే పుట్టిన ధృతరాష్ట్ర పాండురాజులు క్షత్రియులని భాగవతములోం జెప్పంబడినది. ప్రస్తుతము క్షత్రియులని పిలువంబడువారు బ్రాహ్మణులవలన క్షత్రియ స్త్రీలకుం గలిగినందున క్షత్రియులు కారని చెప్పెదరు. ఇందేది సత్యమో చదువరులే నిర్ణయింతురుగాక. ఇవ్విధిని భేదరూపంబులతో బ్రాహ్మణేతర శాఖలన్నియు సంకరంబులని నిరూపించి యేశాఖవారైన వాదనకుం గడంగిన నాశాఖవారితో నాకల్పిత ప్రమాణముల సహాయంబుగాంగాని వాదనలుచేయుచుండిరి. పాపము! తమ యీ కల్పితములన్నియు నితరులు గ్రహింపకయుండు విధమున తారుగాక యొరులు వేదశాస్త్రములు చదువరాదని యొక విధమగు చట్టమేర్పఱచిరి. కాని యీచట్టము బ్రిటిషు చట్టముచే బుట్టదాఖలు గావలసి వచ్చినది. బ్రాహ్మణులు తాముదక్క యితరులందరు శూద్రులనియు, నాశూద్రులైనను పరబ్రహ్మపాదోద్భవులగు శూద్రులు గారనియు, సంకరులనియు, సిద్ధాంత పఱచినటులం బైనిరూపింపంబడినం జక్కంగ విశదమగుచున్నది. కావున శూద్రులని చెప్పుటవలన బ్రాహ్మణేతర



లందరికిం జెల్లునని సిద్ధాంతమగుచున్నది. కావున సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయములలో శూద్రుల (బ్రాహ్మణేతరుల) కే యధికారములు గలవని కల్పించిరో పరిశీలింతము.

## విద్య

సూ॥ అథహాస్య వేదముపశృణ్వతస్త్రపు జతుభ్యాం శ్రోత్ర ప్రతి పూరణము దాజిహ్వాచ్ఛేదో ధారణే శరీరభేదః॥ (మనుస్మృతి) (అనంగా) శూద్రుండు వేదమును వినినేని చెవిలో సీసమునుగాని, లక్కనుగాని కరిగించి పోయవలయును. మఱియును శూద్రుండు వేదము నుచ్చరించినచో జిహ్వాచ్ఛేదనముం జేయువలయును. ధరించినచో (సంపూర్ణముగ నధ్యయనము జేసినచో) శరీరమును ఛేదింపవలయునని చెప్పుచున్నది.

ఈసూత్రమునకు హరిదత్తాచార్యులుగారు శూద్రుండు బుద్ధిపూర్వకముగా వేదమును వినగూడదని మూలసూత్రమునకు వ్యతిరిక్తముగ శూద్రులయందు దయదలంచి వ్యాఖ్యానము చేసియున్నాండు. అయిన నీయభిప్రాయము మూల వాక్యమునందుండు నంత కఠినముగం గన్పట్టదు.

మూ॥ నావిస్పష్టమధీయీత నశూద్రజనసన్నిధౌ। ననిశాంతే పరిశ్రాంతో బ్రహ్మాధీత్య పునస్స్వపేత్॥ మనుస్మృతి.

స్వరవర్ణాదులచే స్పష్టము లేకుండునట్లుగా శూద్ర సన్నిధియందు నధ్యయనముం జేయరాదు. రాత్రి చరమయామమందు లేచి యధ్యయన మొనర్చి శ్రాంతుండై మఱల నిద్రింపంగూడదు.

మఱియును శూద్రునికి వేదమును జెప్పఁగూడదు. శూద్రుని సమీపమున స్వరవర్ణాదులచే స్పష్టత లేకుండినట్లుండను (అనఁగా) నక్షరములు తెలియునట్టుగనైనను) చదువఁగూడదు. మఱియు సగము హోమము చేయఁగా మిగిలిన హవిస్సును బెట్టఁగూడదు. అతనికి ధర్మముల నుపదేశము చేయఁగూడదు. వెండియు నతనిచే వ్రతముల నాచరింపఁ జేయఁగూడదని మనుస్మృతిలోఁ బైయభిప్రాయము లిచ్చునట్టి వాక్యములు గన్పట్టుచున్నవి.

శ్లో॥ శ్వక్రోష్టుగర్ధభోలూక స్సామభాగా ర్త నిస్వనే। అమేధ్య శ్శవ శూద్రాంత్యశ్మశాన పతితాంతికే॥ యాజ్ఞవల్క్యస్మృతి ఆచార కాండము.

అమేధ్యశ్శవ శూద్రాంత్యంతమునందు వేదోచ్చారణముఁ జేయఁ గూడదని చెప్పుచున్నది. మఱియును

శ్లో॥ వేదాక్షర విచారేణ శూద్రస్య నరక ధ్రువమ్। పరాశర స్మృతి 1వ అధ్యాయము.

శ్లో॥ శ్వచర్మణి యథాక్షీర మపేయంబ్రాహ్మణాదిభిః తద్వచ్ఛూద్ర ముఖాద్వాక్యం శ్రోతవ్యం నరదాచన। పండితస్యాపి శూద్రస్య శాస్త్రజ్ఞానరతస్యచ। వచనంతస్యనగ్రాహ్యం శునోచ్ఛిష్టం హవిర్యథా। శూద్రోఽజ్ఞానావలేపేన బ్రాహ్మణాద్భాషతేయది। సయాతినరకం ఘోరంయావదా భూతసంప్లవం। శూద్రం ప్రతిపాదకం। గర్భంచజారజాతంతుదూరః పరివర్జయేత్॥

(అనఁగా) శూద్రుఁడు వేదాక్షర విచారణముఁ జేసినని నరకమునుబొందుట నిశ్చయము మఱియు బ్రాహ్మణులు కుక్క తోలువందు



పాలుంచిన నాపాలనెట్లు గ్రహింపరో యట్లే శూద్ర ముఖమునుండి రాబడిన వాక్యమును గ్రహింపఁగూడదు. శునోచ్ఛిష్టమగు హవిస్సెట్లు గ్రాహ్యమో యట్లే శూద్రుఁడు పండితుఁడైనను శాస్త్రజ్ఞానరతుఁడైనను విడువవలయును. వెండియు బ్రాహ్మణులతో శూద్రుఁడు జ్ఞానవంతుఁడై భాషించినచో నరకమును జెందుచున్నాడు. అను నీప్రకారము పరాశర మాధవీయము 263 పత్రమునందుఁ జెప్పఁబడియున్నది. జయార్థ ప్రకాశిక 3వ భాగమునఁ జెప్పఁబడి యున్నది.

శూద్రులచే రచింపఁబడిన గ్రంథమెంత రసవంతమైనదైనను శునోచ్ఛిష్ట పాయసమువలె విసర్జనీయమని అప్పకవీయమునఁ జెప్పఁబడినది. కొమ్ములుగల యెద్దునకు నెంతదూరముగాఁ దొలఁగి చనవలయునో యంతదూరము చదువుకొనిన శూద్రునకు [దూరమును] దొలగవలెనని నీతిశాస్త్రమున వ్రాసిరి. రావణాది రాక్షసులు వేదపఠనచేసిరని రామాయణమువలన విదితమగుచున్నది. నేడు క్రైస్తవులందఱో వేదము చదివినవారుకలరు. అట్లుండినను వైదిక మతాచారపరులగు బ్రాహ్మణేతరులు విద్య నార్జించినఁ దమమాయలెల్ల వెల్లడియై తమయాధిక్యత నశించునని యెంచి బ్రాహ్మణేతరులను జదువకుండునటులఁ జేయుటకైయివ్విధమగు కల్పనములఁ గావించిరి. ఇంతయేల. పూర్వులచే రచింపఁబడినట్టియు, దేశసౌభాగ్యమున కాధారభూతములైనట్టియు, వ్రాఁత ప్రతులగు గ్రంథరాజము లెన్నిటినో ప్రచురింపక బ్రాహ్మణులచే నిగూఢముగా నుంచఁబడుచున్నవి. వానిఁ బ్రచురించిన దేశసౌభాగ్యము హెచ్చగునని యైనఁ దలంపక యితరులు విద్యను గ్రహింతురేమో యను మోర్వలేని తనమున నటులఁ బ్రచురించక

గుప్తపఱచిరని తెలియుచున్నది. దేశమెట్లధోగతి పాలైనను వారి నిరుద్యోగ సుఖజీవనము వారికున్నఁజాలును. చదువరీ. ఈగ్రంథమున బ్రాహ్మణులు గావించిన, గావింపుచున్న యపకారము నిరూపణచేయుట ముఖ్యోద్దేశము కనుక ప్రతివిషయము బ్రాహ్మణుల సమూహముమీఁద వివరింపఁబడుచున్నది. అటుల బ్రాహ్మణులనిన బ్రాహ్మణవర్గమంతయునని భావింపరాదు. బ్రాహ్మణులలోను దేశపురోభివృద్ధికేఁ దమ సర్వస్వమంతయు నర్పించి కృషిచేయు సుధీరులెందరో కలరు. అట్టివారి నిష్పట్టాన బ్రాహ్మణోత్తములనుట చెల్లును. ఇంక బ్రాహ్మణులనఁదగు కుతంత్ర కోవిదులై దేశానర్థకమును గమనింపక తమనిరుద్యోగ మాయాజీవనమును జెంపొందించుటకునై తమ సోదరుల నధోగతి పాల్జేయు మాయావాదులకుఁ జెందునని మనమూహింపవలసి యున్నది. బ్రాహ్మణ యన్యాయచే నెన్ని గ్రంధములు రూపుమాయుచున్నవో సర్వేశ్వరుఁడే నిరూపించవలె.

## ధ న ము.

శూద్రులనఁగా బ్రాహ్మణేతరులందరునని యిదివఱకు నిరూపించి యున్నాను. ఆశూద్రులు ధనమార్జింపఁగాదని కొన్ని ప్రమాణములను గల్పించిరి. అందుఁ గొన్నిటినిందుఁ బొందుఁబఱచెద. చిత్తగింపుడు.

శ్లో॥ శక్తేనాపిహి శూద్రేణ నకార్యోధనసంచయః। శూద్రోహిధన మాసాద్య బ్రాహ్మణానేవబాధతే॥ మనుస్మృతి 10 అధ్యా॥ 129 శ్లో॥.



(అనఁగా) శూద్రుఁడు, ధనసంచయము చేయుటకు సమర్థుఁడయ్యెను, దారాపుత్రాది పోష్యవర్గ పంచయజ్ఞోపయోగములకన్నను నధికమగు ధనసంచయము చేయరాదు. ఏలనన ధనమధికముగ నుండుటవలన బ్రాహ్మణుల శుశ్రూషచేయక బాధించును. లేక యీ ప్రమాణమునకు వ్యతిరేకముగా ధనమార్జించెనేని బ్రాహ్మణుఁ డాధనమును నిస్సంకోచముగ గ్రహింప వచ్చును.

శ్లో॥ విస్రబ్ధం బ్రాహ్మణశ్శూద్రా ద్ద్రవ్యోపాదాన మాచరేత్। నహితస్యాస్తికించిత్స్వం భర్తృహార్యధనోహిసః॥ మనుస్మృతి 8 అ. 417 శ్లోకం.

దాసుఁడగు శూద్రునివలన ధనమును నిశ్శంకగా బ్రాహ్మణుఁడు తీసికొనవచ్చును. దానికించుకయైన పాపములేదు. శూద్రునిచే సంపాదింపఁబడిన ధనమునకు బ్రాహ్మణుఁడే యజమానుఁడు కనుక నాధనమును బ్రాహ్మణుఁడు బలాత్కారముగ లాగుకొనినను రాజు దండింపరాదు.

ము॥ వైశ్యశూద్రౌ ప్రయత్నేనస్వాని కర్మాణికారయేత్। తౌహిచ్యుతౌ స్వకర్మభ్యః క్షోభయేతా మిదం జగత్. మనుస్మృతి 8 అ. 418 శ్లో॥.

వైశ్యునిచే వాణిజ్యాది కర్మమును, శూద్రునిచే ద్విజ శుశ్రూషాది కర్మమును రాజతి ప్రయత్నముచే జేయింపవలయును. అట్లు కానిచో నావైశ్య శూద్రులశాస్త్రీయ వ్యాపారముచే నతి ధనవంతులై గర్వముచే జగత్తును వ్యాకులింపఁజేతురు. శూద్రుఁడు ధనసంచయముఁ జేయఁగూడదు. బ్రాహ్మణ సేవచేతనే కుటుంబ పోషణ

మునకు ధనము సంపాదింపకొన వలయునని పరాశర మాధవీయ మున జెప్పిరి.

శ్లో॥ యద్బ్రాహ్మణేనా పహృతం ధనం తత్పరలోకదం। శూద్రాయ దత్తమపి యన్నరకాయైవ కేవలం॥ శుక్రనీతి 3వ అధ్యా. 402 శ్లో॥ బ్రాహ్మణుఁడు శూద్రుని ధనమును హరించెనేని యాశూద్రుని కాధనము పరలోకము నిచ్చునదై యున్నది. బ్రాహ్మణుఁడు బుద్ధిపూర్వకముగా నిచ్చిన ధనమును శూద్రుఁడు స్వీకరించెనేని శూద్రుని కాధనము పరలోక హేతువగును.

## ఉద్యోగము.

మూ॥ యస్యశూద్రస్తు కురుతే రాజ్ఞో ధర్మవివేచనం। తస్యసీదతి తద్రాష్ట్రం పంకే గౌరివపశ్యతః॥ మనుస్మృతి అ. 8 శ్లో॥.

ఏ రాజు రాజ్యమందు ధర్మవివేచనము శూద్రుఁడొనర్చునో యారాజు చూచుచుండ బురదలో దిగఁబడిన గోవువలె నారాజ్యము చిక్కుపడి నశించును,

మూ॥ యద్రాష్ట్రం శూద్రభూయిష్టం నాస్తికాక్రాంతమద్విజం। వినశ్య త్యాశు తత్కృత్స్నం దుర్భిక్ష వ్యాధిపీడితం॥

ఏరాజ్యము శూద్ర బహుళమును పరలోకమున లేదనెడి నాస్తికులచే నాక్రాంతమును ద్విజ శూన్యమునగునో యా రాజ్యమంతయు దుర్భిక్షరోగాది పీడితమై శీఘ్రముగ నశించును.

మనుస్మృతి 8 అ. శ్లో 22,



ఈక్రింద నుదహరించు ప్రమాణములు శుక్రనీతిలోనివని ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయమునందు వ్రాయఁబడి యున్నవి.

శ్లో॥ దశపౌత్రాః ఫాలోదాద్యా బ్రాహ్మణాః సర్వవివత్తే। అభావే క్షత్రియాః శస్త తథా వేద ధోరుజాః। నైవశూద్రాస్తు సం జ్యా గుణవంతోపి పార్థివైః॥

శ్లో॥ సేనాధిపః క్షత్రియస్తు బ్రాహ్మణ స్తదభావతః। నవైశ్యోన చవై శూద్రః కాతరశ్చైక దాచన॥

(అనఁగా) రాజు తన యుద్యోగులలో విద్వాంసుఁడైన బ్రాహ్మణుఁడు దక్కకపోయినచో ధర్మశాస్త్రజ్ఞుఁడైన క్షత్రియునిగాని వైశ్యునిగాని యుంచవలయును. మఱియును రాజు తన సమీపమునయందు దశప్రకృతులను యుద్యోగస్థానములయందు బ్రాహ్మణులనే యుంచవలయును. శూద్రుఁడు గుణసంపన్నుఁడైనను యత్నముచే వదలిపెట్టవలయును. ఇదియునుంగాక రాజు తన సేనాధిపతిని నియమించడములో క్షత్రియునైనను బ్రాహ్మణునైనను యుంచవలయును. వైశ్యునిగాని శూద్రునిగాని యత్నముచే వదలిపెట్ట వలయును.

## వృత్తి.

మూ॥ ఏకమేవతు శూద్రస్య ప్రభుః కర్మసమాదిశత్। ఏతేషామేతవర్ణానాం శుశ్రూషా మనసూయయా॥ మనుస్మృతి 1వ అ.91శ్లో.

బ్రహ్మ శూద్రునకు అసూయ లేకుండ బ్రాహ్మణాది వర్ణత్రయమువారికి బనిఁ జేయుట యొక్కటియే నిర్మించెను.

మూ॥ శూద్రంతు కారయేద్దాస్యం క్రీతమక్రీతమేవవా। దాస్యాయైవహి సృష్టోసౌ బ్రాహ్మణస్యస్వయంభువా॥

బ్రాహ్మణుఁడు శూద్రునకు జీతమిచ్చియైన నిడకుండినను వానిచే దాస్యమును చేయించుకొనవలయును. బ్రాహ్మణునకు దాస్యమొనర్చుటకే శూద్రుఁడు బ్రహ్మచే సృజింపఁబడెను.

మూ॥ శూద్రస్తువృత్తి మాకాంక్షన్ క్షత్రమారాధయేద్యదిః ధనినంవాప్యు పారాధ్య వైశ్యంశూద్రోజిజీవిషేత్॥

శూద్రుఁడు బ్రాహ్మణశుశ్రూషచే జీవనము జరగనప్పుడు క్షత్రియునయిన ధనవంతుఁడగు వైశ్యునైన నాశ్రయించి జీవింప నిశ్చయింపవలెను. ద్విజశుశ్రూషచే జరగకుండు నప్పుడు మున్ను చెప్పఁబడిన పనులచే బ్రతుకవలెను.

మూ॥ స్వర్గార్థముభయార్థంవా విప్రానారాధయేత్తుసః। జాతబ్రాహ్మణశబ్దస్య సాహ్యస్యకృతకృత్యతా॥

ఆశూద్రుఁడు స్వర్గప్రాప్తికిఁగాని ఇహాపరములకు రెంటికింగాని బ్రాహ్మణుని నాశ్రయించవలెను బ్రాహ్మణాశ్రితుఁడను శబ్దముచే చెప్పఁబడునదియె వానికి కృతార్థత. బ్రాహ్మణ సంబంధ వ్యపదేశముచే ధన్యుఁడగును.

మూ॥ విప్రసేవైవ శూద్రస్య విశిష్టంకర్మ కీర్త్యతే। యదతోన్యద్ధి కురుతే తద్భవత్యస్య నిష్ఫలం॥

శూద్రునికితరకర్మములకంటె బ్రాహ్మణసేవ ప్రకృష్టమని కర్మశాస్త్రమందుఁ జెప్పఁబడెను. దీనికంటె నన్యకేమి జేసినను వీనికది నిష్ఫలమగునని పూర్వోక్తముగు దానికి స్తుతిపాకయజ్ఞాదులును వానికి విహితము గావున.



మూ॥ అశక్నువంస్తు శుశ్రూషాం శూద్రః కర్తుం ద్విజన్మనామ్। పుత్రదారాత్యయం ప్రాప్తో జీవేత్కారుకకర్మభిః॥ మనుస్మృతి అ. 10 శ్లో. 99.

శూద్రుఁడు ద్విజశుశ్రూష చేయలేక దారాపుత్రాదులన్నము లేక బాధపడునప్పుడు సూపకారాది కారుక కర్మములచే బ్రదుకవలెను.

మూ॥ యైఃకర్మభిః ప్రచరితైశ్శుశ్రూష్యంతే ద్విజాతయః। తాని కారుకర్మాణి శిల్పాని వివిధానిచ॥ మనుస్మృతి అ. 10. శ్లో. 100

పైఁజెప్పఁబడిన కారు కర్మముల విశేషములను దెలియఁజేయుటకే శ్లోకము చెప్పఁబడినది. ఏకర్మములు చేయుటచే ద్విజశుశ్రూష చేయంబడునో యట్టి కట్టెలు చెక్కడము చిత్తర్వులు వ్రాయడము మొదలగునవి జేయవలెను.

క॥ దానోపవాసముల సన్మానిత గతిలేదు శూద్రు ◆ నకు యతి
దెసనమ్మానసమున దత్పూజా, ధనరతింగాని మున్ని ◆ తెరువుల
జూడన్.

తే॥ తెరువుదప్పి తూగాడుచు ◆ నరుగుదెంచు
యతిగనుంగొని మనమున ◆ నడలువాడమ
నెదురుకొని డప్పిదీర్చి న ◆ మ్మదమునేత
శూద్రునకు ధర్మవిధియని ◆ శ్రుతులుసెప్ప.

భారతము. అను శాసనిక పర్వం.

## జీవనము.

శ్లో॥ ఉచ్ఛిష్టమన్నం ధాతవ్యంజీర్ణానివసనానిచ। పులకా
వధాన్యానాంజీర్ణాశ్చైవపరిచ్ఛదాః॥ ప్రకృత ద్విజాత్యా
శూద్రునకు ఉచ్ఛిష్టాన్నమును జీర్ణములగు తమరు కట్టుకొని భు
ములగు వస్త్రములు కేవలము చినిగిపోనిపరిచ్ఛదము గావ

శ్లో॥ ఉచ్ఛేషణం భూమిగతమజిహ్మస్యాశఠస్యచ. దాసవర్గ
స్యతత్పిత్ర్యే భాగధేయం ప్రచక్షతే॥ మనుస్మృతి, అ 3: శ్లో. 24
భూమిగతమగు నుచ్ఛిష్టము అవక్రత్వమున నలసత్వముగల దాస
మునకు పితృకార్యములందు భాగము మనాదులు జెప్పిరి॥ శూద్ర
బ్రాహ్మణోచ్ఛిష్టముచేతను జీర్ణవస్త్రముచేతను పోషించవలెనని మ
స్మృతి రెండవ అధ్యాయమునందు చెప్పబడియున్నది.

శ్లో॥ శ్రాద్ధంకృత్వాయ ఉచ్ఛిష్టంవృషలాయ ప్రయచ్ఛతిసమ
థోనరకంయాతి కాలసూత్రమవాక్ఛిరాః॥

మనుస్మృతి: అ. 3: శ్లో. 24

ఆశ్రయించియున్న శూద్రుల కుచ్ఛిష్టమిడ బ్రసక్తించిన
నిషేధము శ్రాద్ధ భోజనోచ్ఛిష్టము నైనను శూద్రునకు బెట్టు
యామూఢుడు తలక్రిందుగా కాలసూత్రమను నరకమందుబడు

శ్లో॥ నశూద్రాయ మతిందద్యా నోచ్ఛిష్టం నహవిష్కృత
నచాస్యోపదిశేద్ధర్మం నచాస్యవ్రతమాదిశేత్॥

మనుస్మృతి: అ. 4: శ్లో. 81

శూద్రునకు మతినుపదేశింపగూడదు అనగా ధర్మోపదేశ
చేయగూడదని వేరేచెప్పటవలన నదృష్టార్థోపదేశమని తెలియవ



యును. దాసుడు గాని శూద్రునకు నుచ్ఛిష్టము పెట్టగూడదు. దాసున
కుచ్ఛిష్టము బెట్టవలెనని వత్స్యపురాణమువలన ఉచ్ఛిష్టము బెట్టుటచే
బాలకు దోషమైనను యథాసంభవలబ్ధ విషయమనగా ననుచ్ఛిష్టము
నగా నుచ్ఛిష్టమిడగూడదని సగము హోమమొనర్చగా నున్న హవిస్సు
నిడరాదు. ధర్మోపదేశము జేయగూడదు.

## దేవాలయ ప్రతిష్ఠ.

### బృహన్నారదీయము.

"స్త్రీణామనుపనీతానాం శూద్రాణాంచనరేశ్వర।
స్థాపనేనాఽధికారోస్తి విష్ణోర్వాశంకరస్యచ।
యశ్శూద్రసంస్కృతం లింగంవిష్ణుంవాఽపినమేన్నరః.
ఇహావాఽత్యంతదుఃఖాని పశ్యత్యాముష్మికేకిము।
శూద్రోవాఽనుపనీతోవాస్త్రీ యోవాపతితోఽపివా।
కేశవంవాశివంవాఽపిస్పృష్ట్వానరకమశ్నుతే॥"

అనగా స్త్రీలు అనుపనీతులగు శూద్రులు వీరికి విష్ణుస్థాపనము
నందు శివస్థాపనమందు నధికారము లేదు. కనుక శూద్రునిచే సంస్క
రింపబడిన లింగమునుగాని విష్ణువునుగాని నమస్కరించువాడు అతి
దుఃఖమును బొందును. పరలోకమందు జెప్పెడిదేమి? కనుక మీద
జెప్పిన స్త్రీలు మొదలగు ననధికారులు విష్ణువునుగాని శివునిగాని స్పృ
శించినచో నరకము నొందుదురనుట. చదువరులారా! లింగమును
స్పృశించుటకు శూద్రులకధికారము లేదట కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ
శాఖలవారు శూద్రులట. ఇక నాసిద్ధాంతము ననుసరించియీశాఖల
వారు లింగములను స్పృశింపరాదనుట యేటవెల్లంబేగదా! అట్లైన

గ్రంథబాహుళ్యమునకు జంకక యీయొక్క విషయమునఁగల సత్యమును బరిశీలింతము.

రేచర్ల నామిరెడ్డి క్రీ. శ. ౧౧౭౭వ సంవత్సరమున బిల్లలమఱ్ఱి గ్రామమునఁ దనతండ్రి కామయ్య పేరట కామేశ్వర దేవుని తనతల్లి కాచాంబ పేరిట కాచేశ్వరదేవుని, తన పేరిట నామేశ్వరదేవుని ప్రతిష్ఠాపనముచేసి గుళ్లు కట్టించి శాసనము వ్రాయించెను.

ఆంధ్రుల చరిత్రము, ద్వితీయ భాగము 178 పేజి.

ఈ రేచర్ల నామిరెడ్డి వెలమ కులజుడు.

భర్త మరణానంతరము గణపాంబ ధర్మకార్యము లనేకములను గావించెను. ఈమె తనభర్త స్వర్గస్థుడైన తరువాత ధాన్యకటకములోని యమరేశ్వరాలయము యొక్క గోపురమున సువర్ణ కలశములను నిర్మించెను. ఈమెయొక శివాలయము నిర్మించి అందు తనభర్త (బేతరాజు) పేరిట బేతేశ్వరనామముతో లింగప్రతిష్ఠ గావించెను. ఈ బేతేశ్వరాలయ గోపురమునందుగూడ సువర్ణ కలశములను బెట్టించెను. ఈ శివాలయము సంరక్షణకొరకు ధాన్య సమృద్ధమైన 'బెనదేవి'యను గ్రామమును నొసంగి దానశాసనము వ్రాయించెను. ఇంతియేగాక బ్రాహ్మణులకనేక దానములు గావించెను. మరియును దన తండ్రి గణపతిదేవ చక్రవర్తి పేరిట గణపేశ్వర శివాలయమును నిర్మింపించి దాని సంరక్షణమునకుగాను చింతపాడను గ్రామమును దానము చేసెను.



ఆంధ్రుల చరిత్రము ద్వితీయభాగము 240.241వ పేజీలు.

గణపాంబ భర్త బేతరాజు కమ్మకులజుడు. గణపాంబ తండ్రి గణపతిదేవ చక్రవర్తి కాకతీయుడు. కాకతీయులు కమ్మవారు ఏక శాఖీయులనుట కిదియొక ప్రమాణము.

ఆయ్యవంశమున జనించిన భీమయ్య యను కమ్మ నాయకుడొకడు వెలనాటిలోని కొఱియ్యాపురమందు నివసించియుండెను. ఆ భీమనాయకునకు రాజాంబికవలన జల్లయ, నారయ, సూరయ యను మూవురు పుత్రులు జనించి వెలనాటి చోడమహారాజు కొలువున నుద్యోగములను వహించి యుండిరి. ............... ........................................... నారపనాయకునకు చోడనాయకుడు, భీమనాయకుడు, పిన్న చోడనాయకుడు, బ్రహ్మనాయకుడు నను నలుగురు పుత్రులు జనించి వెలనాటి చోడరాజునకు సేనాధిపతులై చతుస్సముద్రమువలెనుండి దేశమును శత్రు బాధనుండి సంరక్షించుచుండిరి. వీరిలో మూడవ వాడైన పిన్నచోడునకు దామాంబ (దామమ్మ) వలన నారాంబ (నారమ్మ), పేరమాంబ (పేరమ్మ) యను కూతులును పృథ్వీనాయుఁడు, జయపనాయుఁడు, నారపనాయుఁడు (నారాయణుఁడు) నను పుత్రులును జనించిరి................... ...............జయపనాయకుఁడు శాత్రవులను నిర్జించుటచేత వైరిగోధూమ ఘరట్టమను బిరుదమును పొంది విఖ్యాతి గాంచెను. ఇతఁడు గణపతి దేవుని పేట గణపతీశ్వరాలయమును గట్టించి దానికి ననేక గ్రామములను దానము చేసెను......

..................మఱియు నితఁడు శా. శ. ౧౧౫౯వ సంవత్సర వైశాఖ సు॥ తృతీయా శనివారమునాఁడు తామరపురము (చేబ్రోలు)లో గణపతి శ్రీ క్షేత చోడేశ్వర లింగమును ప్రతిష్ఠాపించి యాశివాలయమున కెదుట దేవదాసీలు నివసించుటకై కొఁజేసి యంతరువులుగల రెండు వరుసల యిండ్లను గట్టించి దేవుని యంగ రంగ భోగములకై (మోదుకూరు ; చేబ్రోలునకు ౬ మైళ్ల దూరముననున్న మోదుకూరు) గ్రామమును దానము చేసెను.

ఈగణపతేశ్వరాలయమున, శేన ఈ శ్రీపేర చోడేశ్వరాలయమును ప్రతిష్ఠాపనముజేసిన జయపనాయకుఁడు కమ్మకులజుఁడని వేరు వివరింప బనిలేదు. ఇవ్విధినిఁ దమ తమ పితృబంధువులయొక్క పేరున నిప్పుడున్న దేవాలయములలో ముప్పాతికవంతు బ్రాహ్మణేతరులు లింగప్రతిష్ఠాపనము జేసి వాని పోషణముకై యగ్రహారంబు లొసగి యుండిరి. మిగిలిన పాతిక వంతులో నూటికి తొంబది తొమ్మిది దేవాలయములు బ్రాహ్మణేతరులు కట్టించి వాని పోషణముకై యగ్రహారములు, మాన్యము లొసంగిరి. ఇట్లు లింగ ప్రతిష్ఠఁజేసినవారు లింగములను స్పృశింప కూడదా? అయ్యది ధర్మమా? యోజింపుడు. అయితే అర్చకులు స్పృశింపవచ్చునా? అర్చకులు ద్విజులుగారని శివ పీఠిలో రూపింపబడిన బ్రాహ్మణులచేఁ జెప్పఁబడిన ప్రమాణములు జెప్పుచున్నవే? అట్లు ద్విజులుగాని యర్చకులు శూద్రులేగదా! అట్లు శూద్రులని పిలువఁబడు అర్చకులు కమ్మ, వెలమ మున్నగు శాఖ వారిచ్చిన మాన్యములచే జీవించుచు లింగమును స్పృశింపవచ్చునుగా



తమపితరుల పేర దేవాలయ ప్రతిష్ఠాపనముజేసి తత్పోషణమునకై యగ్రహారములిచ్చి తత్సేవకై మాన్యములిచ్చి యంగరంగ వైభోగములకు సదుపాయములుజేసిన కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ మున్నగు శాఖలవారు లింగమును స్పృశింపఁగూడదా? ఇయ్యది బ్రాహ్మణ అధర్మమా? సర్వేశ్వరుని సధర్మమా? బ్రాహ్మణుల ధర్మమనుటయే చెల్లును. అర్చక బృందమైనను దమ స్థితిగతులు తాము చక్కఁజేసికొనక తామధికుల మనుకొనుచు చాల యభిప్రాయమును బూని మాన్యముల ననుభవించుచు స్వామి కార్యములను నిర్వహింపక స్వసుఖాభిలాషతో దుర్వ్యయములు చేయుచు బ్రాహ్మణులనన్న ముందు బ్రాహ్మణేతరులను దరిజేరనీయక యపభ్రంశమైన నడవడికలుగలవారై యలరారుచుండిరనుట జగత్ప్రసిద్ధము. పితృభక్తిపరుడు పితరులపేరుతో లింగ ప్రతిష్ఠాపనముఁజేసి యాయాలయోద్యోగికి మాన్యములిచ్చి యర్చకుని నుంచగా నాయర్చకుఁడా పితృభక్తిపరుని వారసులకన్న నధికుఁడనకెక్కు. డధికారముగలదనుట కాలమహిమయేగాని వేఱుగాదు. దీనివలన, విద్యకు, ధనమునకు మోక్షమునకు బ్రాహ్మణేతరులెట్లర్హులుగాక యుండిరో యట్లే తమ పితరుల పేరుచే నిర్మింపఁబడిన లింగమునకుఁ బూజఁజేయుట కనర్హులని సిద్ధాంతమగుచున్నది.

## మోక్షము.

శ్లో॥ జపస్తపస్తీర్థయాత్రా ప్రవ్రజ్యామంత్రసాధనం దేవతారాధనం
చైవ స్త్రీ శూద్రపతనాని షట్॥ అత్రిస్మృతి 1వ అధ్యాయము.

(అనఁగా) జపము, తపము, తీర్థయాత్ర, సన్యాసము, మంత్రసా

ధనము, దేవతారాధనము అను నీయారింటిని స్త్రీశూద్రులు యవలంబించిరేని పతితులగుదురు.

శ్లో॥ విప్రాణాం వేదవిదుషాం గృహస్థానాం యశస్వినాం।
శుశ్రూషైవతు శూద్రస్యధర్మో నైశ్రేయసః పరః॥
మనుస్మృతి: అ. 9: శ్లో 334.

శూద్రులకు. వేదవేత్తలును స్వకర్మానుష్ఠాన తత్పరతచే ప్రసిద్ధులగు బ్రాహ్మణులకు పరిచర్యయొనర్చుటయే స్వర్గప్రాప్తి మూలమగుధర్మము.

శ్లో॥ శుచిరుత్కృష్ట శుశ్రూషుర్మృదు వాగనహంకృతిః।
బ్రాహ్మణాద్యాశ్రయోనిత్యముత్కృష్టాం జాతిమశ్నుతే॥
మనుస్మృతి: అ. 9: శ్లో 335.

బాహ్యాభ్యంతర శుచియు ద్విజశుశ్రూషయును సపరుష భాషయు దనజాతికంటే నుత్కృష్టులనఁగా బ్రాహ్మణాది వర్ణత్రయమువారిలో బ్రాహ్మణసేవయు వారికి సంభవింపనిచో క్షత్రియ వైశ్య సేవయుం జేసిన శూద్రుడుత్తమజాతి జన్మము నొందును. శూద్రుడుపవాసము చేయవలదు. దానముచేఁ బవిత్రుఁడగునని పరాశర స్మృతియందు చెప్పఁబడినది. తపస్సు చేయుచున్న శూద్రుని రాముడు చంపెనని రామాయణమునఁ జెప్పిరి.

## శిక్ష.

శూద్రుఁడు గావించిన నేరములకై మనుస్మృతిలోని 8వ అధ్యాయమునందు శిక్షావిధాన మీక్రింది విధమునఁ జెప్పఁబడియున్నది.



శ్లో॥ ఏకజాతిః ద్విజాతీంస్తు వాచాదారుణయాక్షిపన్।
జిహ్వాయాః ప్రాప్నుయాచ్ఛేదం జఘన్యప్రభవో హిసః॥
మనుస్మృతి: అ. 8: శ్లో 270.

శూద్రుఁడు ద్విజులను పాపపు తిట్లనుతిట్టెనేని వాని నాలుకను గోయించవలెను. పాదజుఁడధముఁడు గావున.

శ్లో॥ శ్రుతం దేశంచ జాతించకర్మ శారీరమేవచ।
వితథేనబ్రువన్ దర్పాద్దాప్యస్స్యాద్ద్విశతందమం॥
మనుస్మృతి. అ. 8 శ్లో. 273.

ఇది సమానజాతి విషయము. దండనము స్వల్పము గావున ద్విజులు నాక్షేపించు శూద్రుని విషయము గాదు. నీవు చదువలేదు. నీవాదేశస్తుఁడవుగావు. నీవాజాతిగలవాఁడవుగావు నీశరీరముపనయనాదులచే సంస్కరింపఁబడలేదని యహంకారముచే వ్యర్థముగాఁ బలికిన వానికి నిన్నూరు పణములు దండనము రాజు విధింపవలెను.

శ్లో॥ యేనకేన చిదంగేన హింస్యాచ్ఛేచ్ఛ్రేష్ఠమంత్యజః।
ఛేత్తవ్యంతత్తదేవాస్య తన్మనోరనుశాసనం॥
మనుస్మృతి. అ. 8 శ్లో. 279.

శూద్రుఁ డేయవయవముచే బ్రాహ్మణునిఁ గొట్టునో రాజా శూద్రుని యొక్క యాయవయవమును ఛేదింపవలెనని మనుశాసనము.

శ్లో॥ బ్రాహ్మణాన్ బాధమానంతు కామాదవరవర్ణజం।
హన్యాచ్చిత్రైర్వధోపాయైరుద్వేజనకరైర్నృపః॥
మనుస్మృతి. అ. 9. శ్లో. 248

శరీరపీడ ధన హరణము మొదలగు వానిచే బ్రాహ్మణుల బాధించెడు శూద్రుని - ఛేదనాది వధోపాయములచే భయంకరము నట్లు రాజు వధింపవలెను.

శ్లో॥ పాణిముద్యమ్య దండంవాపాణి చ్ఛేదనమర్హతి।
పాదేనప్రహరన్ కోపాత్పాదచ్ఛేదనమర్హతి॥

మనుస్మృతి. అ 8. శ్లో. 28

చేయెత్తిగాని కఱ్ఱయెత్తిగాని కొట్టినచో హస్తఛేదనమును కాలెత్తి తన్నినేని పాదఛేదనమును బొందును.

చూచితిరా పాఠకులారా! రాజాధిరాజగు జార్జిసార్వభౌముని శాసనములైనను నింత ఘోరముగా లేవుగదా!

## బ్రాహ్మణాధిక్యత.

శ్లో॥ ఉత్తమాంగోద్భవాజ్జ్యైష్ఠ్యాద్బ్రాహ్మణశ్చైవధారణాత్।
సర్వస్యైవాస్యసర్వస్య ధర్మతో బ్రాహ్మణఃప్రభుః॥

మనుస్మృతి: అ. 1: శ్లో. 93.

ముఖము లోనగు నుత్తమాంగమైన బ్రహ్మదేవుని ముఖమందు జన్మమువలనను క్షత్రియాదులకంటె ముందుగఁ బుట్టుటవలనను వేదమును ధరించుటవలనను నీజగమంతకును ధర్మానుశాసనమువలన బ్రాహ్మణుఁడు ప్రభువు.

శ్లో॥ తంహిస్వయంభూస్స్వాదాస్యాత్తపస్తప్త్వాదితోఽసృజత్।
హవ్యకవ్యాభివాహ్యాయ సర్వస్యాస్యచగుప్తయే॥

మనుస్మృతి: అ. 1: శ్లో. 94.



ఆ బ్రాహ్మణుని బ్రహ్మతపంబొనర్చి తనముఖమువలన హవ్య వ్యములను వహింపుటకును ఈ సకల జగత్తుయొక్క రక్షణముకొఱకును ముందుగ సృజించెను.

శ్లో॥ యస్యాస్యేనసదాశ్నంతి హవ్యానిత్రిదివౌకసః।
కవ్యానిచైవపితరః కింభూతమధికంతతః॥

మనుస్మృతి: అ. 1: శ్లో 95.

ఏ బ్రాహ్మణునియొక్క ముఖముచేత హవ్యములను దేవతలును వ్యములను పితృదేవతలు నెల్లప్పుడును భక్షింతురో యాబ్రాహ్మణున ంటె నధికమగు భూతము మరేదికలదు! బ్రాహ్మణుఁడందరికంటె నధి డని యర్థము

శ్లో॥ బ్రాహ్మణోజాయమానోహి పృథివ్యామధిజాయతే।
ఈశ్వరస్సర్వభూతానాం ధర్మకోశస్యగుప్తయే॥

మనుస్మృతి: 1అధ్యాయము: శ్లో. 99.

సర్వభూతములయొక్క ధర్మమను ధనరాశిని రక్షించుటకై భూమియందు జన్మించుచున్న బ్రాహ్మణుఁడై యీశ్వరుఁడు జన్మించుచున్నాఁడు.

శ్లో॥ సర్వస్వం బ్రాహ్మణస్యేదం యత్కించజ్జగతీగతం।
శ్రైష్ఠ్యేనాభిజనేనేదంసర్వం వైబ్రాహ్మణోఽర్హతి॥

మనుస్మృతి: అ. 1: శ్లో, 100

భూమియందేమేమి ధనముకలదో యదంతయు బ్రాహ్మణునకు స్వయమనిస్తుతికై జెప్పఁబడెను. స్వామునాటిదే యని తాత్పర్య

ములటులఁగాకున్నను బ్రాహ్మణునకు చౌర్యము శిక్షాశాస్త్రమందు మనువేలజెప్పఁడు. బ్రహ్మముఖమందుఁ బుట్టుటవలనను శ్రేష్ఠత్వము వలనను నీసర్వమును గ్రహించుటకు బ్రాహ్మణుండే యర్హుఁడగు చున్నాఁడు.

శ్లో॥ స్వమేవబ్రాహ్మణోభుఙ్క్తే స్వంవస్తే స్వంచదాతిచ ।
ఆనృశంస్యాద్బ్రాహ్మణస్య భుంజతేహీతరేజనాః ॥

మనుస్మృతి: అ. 1: శ్లో. 101.

బ్రాహ్మణుఁడు పరునియన్న మేదినను పరుని వస్త్రమేదికట్టుకొనినను పరునిసొమ్మేది యొరునికిచ్చినను యదిస్వీయమువలెనేయగునని స్మృతికై జెప్పఁబడెను. ఈజగంబునఁగల పదార్థముల నితరులందరును బ్రాహ్మణునికారుణ్యముచే ననుభవించుచున్నారు.

శ్లో॥ తాడయిత్వాతృణేనాపి సంరంభాన్మతిపూర్వకం ।
ఏకవింశతిమాజాతీః పాపయోనిషుజాయతే ॥

మనుస్మృతి: అ. 4: శ్లో. 166.

గడ్డిపరకచేతనయినా బుద్ధిపూర్వకముగ క్రోధమువలన బ్రాహ్మణునిఁగొట్టి యిరువదియొకజన్మములదనుక శునకాది పాపయోనులందుఁ బుట్టును.

శ్లో॥ వృద్ధాంశ్చనిత్యంసేవేతవిప్రాన్వేదవిదశ్శుచిన్ ।
వృద్ధసేవీహిసతతం రక్షోభిరపిపూజ్యతే ॥

మనుస్మృతి: అ. 7: శ్లో. 38.

నిత్యమున్ను వేదార్థవేత్తలును వయస్సుచేతను వృద్ధులను



శౌచాచారసంపన్నులునగు బ్రాహ్మణులను సేవించవలయును. అటుల వృద్ధులను సేవించువాని రాక్షసులును యెల్లప్పుడు పూజింతురు.

శ్లో॥ సర్వేషాంతువిశిష్టేన బ్రాహ్మణేనవిపశ్చితా ।
మంత్రయేత్పరమంమంత్రం రాజాషాడ్గుణ్య సంయుతం ॥

మనుస్మృతి: అ. 7: శ్లో. 58:

ఈమంత్రులందరిలోను ధార్మికత్వాది గుణవిశిష్టుఁడును బ్రాహ్మణుఁడగు నొకనితో వక్ష్యమాణమగు గుణయుక్తమగు ప్రకృష్టసంధివిగ్రహాదికముయొక్క మంత్రమును నిరూపించవలెను.

శ్లో॥ నిత్యంతస్మిన్సమాశ్వస్తస్సర్వకార్యాణినిక్షిపేత్ ।
తేనసార్థంవినిశ్చిత్య తతఃకర్మసమాచరేత్ ॥

2 మనుస్మృతి: అ. 7: శ్లో. 59.

ఎల్లప్పుడును బ్రాహ్మణునియందే నమ్మకముగలిగి తాఁజేయు కార్యములన్నిటి నతనికప్పఁజెప్పవలెను. అతనితో నిశ్చయించియున్న కార్యములను నారంభించవలయును.

శ్లో॥ మ్రియమాణోప్యాదదీతన రాజాశ్రోత్రియాత్కరం ।
నచక్షుధాస్యసంసీదేచ్ఛ్రోత్రియోవిషయేవసన్ ॥

ధనములేక రాజెంతక్షీణించినను శ్రోత్రియ బ్రాహ్మణునివలన పన్నును బుచ్చుకొనఁగూడదు. ఈరాజుయొక్క రాజ్యమందు శ్రోత్రియుఁడాకలిచే నీరసించఁగూడదు.

శ్లో॥ యస్యరాజ్ఞస్తువిషయె శ్రోత్రియస్సీదతిక్షుధా।
తస్యాపితత్క్షుధారాష్ట్ర మచిరేణైవసీదతి॥

ఏ రాజుయొక్క దేశమందు శ్రోత్రియుండాకలిచే సీరసించునో యారాజుయొక్క రాజ్యము శీఘ్రముగా దుర్భిక్షాదులచే సీరసించును.

శ్లో॥ జిత్వాసంపూజయేద్దేవాన్ బ్రాహ్మణాంశ్చైవధార్మికాన్।
ప్రదద్యాత్పరిహారాంశ్చ ఖ్యాపయేదభయానిచ॥

పరరాష్ట్రమును జయించి యచ్చటనున్న దేవతలను ధర్మప్రధానులగు బ్రాహ్మణులను భూమిసువర్ణాది దానసన్మానములచే బూజించవలెను. ఆపూజయును జయించఁబడిన ద్రవ్యములో కొంతచేతనే చేయవలెను ॥శ్లో॥ నాతఃపరతరోధర్మో నృపాణాంయద్రణార్జితం। విప్రేభ్యోదీయతేద్రవ్యం ప్రజాభ్యశ్చాభయంసదా॥" ఆర్జించినద్రవ్యము బ్రాహ్మణులకిచ్చుటయుఁ బ్రజలకభయమిచ్చుటయు నింతకంటె రాజులకధిక మైనధర్మము లేదని యాజ్ఞవల్క్యు. జేనబ్రాహ్మణుల కీద్రవ్యమీఁబడెనని తద్దేశవాసులకు బరిహారము నివవలెను. మఱియును మీరుస్వామిభక్తిచే మాయెడలఁజేసిన యపకారములు క్షమింపఁబడెను. మీరునిర్భయులై మీమీకార్యములందు సుఖముగ నుండుడని ప్రజల కభయము నొసగవలెను. ఇట్లుప్రకటించవలెను.

శ్లో॥ జాతిమాత్రోపజీవీవా కామం స్యాద్బ్రాహ్మణబ్రువః
ధర్మప్రవక్తానృపతేః నతుశూద్రఃకథంచన॥

పైశ్లోకమువలె బ్రాహ్మణకర్మానుష్ఠానములేక జాతిమాత్ర బ్రాహ్మణుడైనను సాక్ష్యాదికముచే స్ఫుటముగ న్యాయాన్యాయని రూపణమందు సమర్థుడైతేనా బ్రాహ్మణబ్రువుడైన నించుకమంచిది యుక్తయోగ్య బ్రాహ్మణాభావమందుఁగాని కార్యదర్శనమందు ధార్మికుఁడైనను వ్యవహారజ్ఞుడైనను శూద్రుఁడు నియోగార్హుఁడుగాఁడు.



సూ॥ "బ్రాహ్మణోధర్మప్రవక్తా" యనువిధివలననే శూద్రునకు నివృత్తి సిద్ధమగుచుండ మఱల "శూద్రఃకథంచన" యనిచెప్పుట యోగ్యబ్రాహ్మణాభావమందు క్షత్రియ వైశ్యుల కనుజ్ఞానార్థము. ॥శ్లో॥ యత్రవిప్రోనవిద్వాన్ స్యాత్ క్షత్రియంతత్రయోజయేత్। వైశ్యంవాధర్మశాస్త్రజ్ఞం శూద్రంయత్నేనవర్జయేత్॥" అని కాత్యాయన వచనము వలన.

శ్లో॥ విద్వాంస్తు బ్రాహ్మణోదృష్ట్వాపూర్వోపనిహితంనిధిం।
అశేషతోప్యాదదీత సర్వస్యాధిపతిర్హిసః॥

విద్వాంసుఁడగు బ్రాహ్మణుఁడు పూర్వమందుంచఁబడిన నిధినిఁ జూచి సర్వమును బుచ్చుకొనవలెను. ఆగనపాలీహుదగము. ఇతఁడు సర్వమయిన ధన జాతమునకును బ్రభువుగావునసే. శ్లో॥ "సర్వస్వ బ్రాహ్మణస్యేద"మని చెప్పఁబడెను. కావున నీవచనము పరనిహిత విషయము. అందుకు నారదుఁడు, శ్లో॥ "పరేణనిహితంలబ్ధ్వారాజాహ్యపహరేన్నిధిం రాజగామీనిధిస్సర్వం సర్వేషాం బ్రాహ్మణాదృతే." పరులచే నుంచఁబడిన నిధిని రాజు బొందిపుచ్చుకొనవచ్చును. సర్వమగు నిధిజాతకమునకు రాజధికారి, బ్రాహ్మణుని నిధివినాగాసని, యాజ్ఞవల్క్యులును "రాజాలబ్ధ్వానిధిందద్యాద్ద్విజేభ్యోర్థంద్విజఃపునః। విద్వానశేషమాదద్యాత్ససర్వస్య ప్రభుర్యతః." రాజునకు దొరికిన నిధిలో నర్థము ద్విజులకొసఁగవలెను. విద్వాంసుఁడగు బ్రాహ్మణుఁడంతయు దాన పుచ్చుకొనవలెనుగాని యీనక్కఱలేదు బ్రాహ్మణుఁడంతకును బ్రభువుగావుననని మేధాతిథి గోవిందరాజుచే ఇది నాది యని చెప్పఁబడినది. పిత్రాది నిహితత్వమును చెప్పుటచే రాజదేయధన నిరాసార్థ

మని వ్రాసెను. ఇది యర్థము గాదనిన్ని నారదాదిముని వ్యాఖ్యావిపరీతమనిన్ని కుల్లూకభట్టు వ్రాసెను.

శ్లో॥ యైఃకృతస్సర్వభక్షోఽగ్నిరపేయశ్చ మహోదధిః।
క్షయీ చాప్యాయితస్సోమః కోనశ్యేత్ప్రకోప్య తాన్॥

ఏ బ్రాహ్మణుల శాపముచే నగ్ని సర్వభక్షకుఁడును సముద్రుఁడపేయసలిలుఁడును చంద్రుఁడు క్షయయుక్తుఁడును తరువాత పూర్ణుఁడును చేయఁబడిరో యా బ్రాహ్మణులను కోపింపఁజేసి యెవఁడు నశింపలేఁడు

శ్లో॥ నాదదీత నృపస్సాధుర్మహాపాతకినో ధనం।
ఆదదానస్తు తల్లోభాత్తేన దోషేణ లిప్యతే॥

ధార్మికుఁడగు రాజు మహాపాతకియొక్క ధనముఁ బుచ్చుకోనాఁడు. లోభముచేఁ బుచ్చుకొనెనేని తాను నామహాపాతకి దోషము నొందును. అయితే యాధనమున కేమిగతి యనిన చెప్పుచున్నాఁడు.

శ్లో॥ అప్సుప్రవేశ్య తం దండం వరుణాయోపపాదయేత్।
శ్రుతవృత్తోపపన్నే వా బ్రాహ్మణే ప్రతిపాదయేత్॥ మనుస్మృతి.

ఆదండ ధనమును నద్యాది జలమందుఁ బడవేసి వరుణున కప్పగించడమైన శ్రుతవృత్త సంపన్నుఁడగు బ్రాహ్మణునికైన నీవలెను.

శ్లో॥ యోనదద్యాద్ద్విజాతిభ్యో రాశిమూలముపాగతః।
సచోరస్సచపాపిష్ఠో బ్రహ్మఘ్నం తం వినిర్దిశేత్॥

పరాశరస్మృతి 2 అ. 10 శ్లో॥



బ్రాహ్మణులకు కళ్లమువద్ద ధాన్యము పెట్టనివానిని దొంగయనియు అతిపాపియనియు బ్రహ్మహత్య చేయువాఁడనియు చెప్పవలెను.

త్రింశద్భాగం బ్రాహ్మణానాం కృషింకుర్వన్న దోషభాక్॥

పరాశరస్మృతి 2 అ. 11 శ్లో.

కృషిచేయువాఁడు బ్రాహ్మణులకు ముప్పదవ భాగము నిచ్చుటచే దోషమును తొలఁగించుకొనును.

శ్లో॥ సవవసియమంత్యక్త్వా బ్రాహ్మణం యోపవసత్యతే।
వృథాతస్యోపవాస స్స్యాన్నసపుణ్యే నయుజ్యతే॥

పరాశరస్మృతి 6 అ. 56 శ్లో.

బ్రాహ్మణులనాదరించి తానె యొక వ్రతమును కల్పించుకొని యుపవాసముచేసిన నది నిష్ఫలమగును. పాపము నశింపదు.

## దానఫలము.

శ్లో॥ భూమిదో భూమిమాప్నోతి దీర్ఘమాయుర్హిరణ్యదః।
గృహదోఽగ్ర్యాణి వేశ్మాని రూప్యదో రూపముత్తమం॥

మనుస్మృతి అ. 4. శ్లో. 230.

భూదాత భూపతియగును. సువర్ణము నిచ్చువాఁడు దీర్ఘాయుష్యము నొందును. గృహప్రదుఁడు మంచి గృహములు గలవాఁడగును. వెండి నిచ్చిన యతఁడందరికంటె నెక్కుడు సౌందర్యము గలవాఁడగును.

శ్లో॥ వాసోదశ్చంద్రసాలోక్యమశ్విసాలోక్యమశ్వదః।
అనడుత్ప్రదశ్శ్రియం పుష్టాంగోదో బ్రధ్నస్యవిష్టపం॥

మనుస్మృతి అ 4 శ్లో. 231.

వస్త్రదాత చంద్రలోకమును, గుఱ్ఱము నిచ్చినవాఁడశ్వినీ దేవతల లోకమును, ఎద్దునిచ్చువాఁడు సంపూర్ణమగు సంపత్తిని, గోవు నిచ్చినయతండు సూర్యలోకమును బొందును.

శ్లో॥ యానశయ్యాప్రదోభార్యా మైశ్వర్యమభయప్రదః।
ధాన్యదశ్శాశ్వతం సౌఖ్యం బ్రహ్మదో బ్రహ్మసాష్టితాం॥

మనుస్మృతి అ. 4. శ్లో. 232.

రథాది యానములు శయ్యలు నొసగినవానికి భార్యాలాభమగును. ప్రాణులకభయ మిచ్చునతండు ప్రాణిహింస చేయనివాఁడు గొప్ప యైశ్వర్యమును బొందును. ధాన్యమనఁగా శాలియవగోధూమాదుల నిచ్చువాఁడు శాశ్వతసుఖము నొందును. వేదమును జెప్పినను, తదర్థమును దెలిపినను బ్రహ్మలోకమనఁగా ముక్తుఁడగును.

శ్లో॥ సర్వేషామేవదానానాం బ్రహ్మదానం విశిష్యతే।
వార్యన్నగోమహీవాసస్తిల కాంచనసర్పిషాం॥

మనుస్మృతి అ. 4. శ్లో. 233.

అన్నోదక గోమహీతిల కాంచనాది దానములెన్ని గలవో వీని యన్నింటిలోను వేదదాన ముత్కృష్ట ఫలప్రదమగు నుత్తమము.

శ్లో॥ సమమబ్రాహ్మణేదానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే।
ప్రాధీతే శతసాహస్రమనంతం వేదపారగే॥

మనుస్మృతి అ. 4. శ్లో. 85.



బ్రాహ్మణేతర క్షత్రియాదుల కిచ్చినది యెంతో యెక్కువ యెక్కువ లేకుండ నంతే ఫలమిచ్చును. కర్మాది నిష్ఠలేక బ్రాహ్మణుఁడని పిలువఁబడువాఁడు బ్రాహ్మణ బ్రువుఁడతనికిచ్చిన దానము పూర్వము కంటె ద్విగుణ ఫలమిచ్చును. ఉపక్రమించి కొంత వేదమును జదివిన బ్రాహ్మణునకిచ్చిన దానము శతసహస్ర గుణమగును. సర్వశాఖాధ్యాయియగు వానికిచ్చినది యనంతఫలదమగును. "సహస్ర గుణమాచార్యే" యను మూఁడవ పాఠమును కొందరు వ్రాసిరి.

## ప్రతిఫలము.

భూసురులలో నెవరైన బ్రాహ్మణేతరుల యింటికి వచ్చినపుడు వారు వారికి సభ్యతాసముతో వందన శతంబులొనరించి పిదప వారిని సుచితాసనమున నాసీనులఁజేసి, తాము వారిపాదములకడ దీన భావముగలఁ వినయముతో భూమిపయి నాసీనులగుదురు. అనంతరమున నాపితకులాభరణుఁడు తన కార్యమును యాచించుటకు మున్నా సూద్రుష్టాంశము నతని తాతతండ్రులనుండి నుతించుటకు మొదలిడును.

దానమున మీతాతగారు కర్ణుని మించిపోయిరని చెప్పుట కెంతమాత్రము సందియములేదయ్యా! ఆయనచేసిన దానములవలన మా బ్రాహ్మణులందఱహర్నిశ మాయన నామస్మరణఁ గావించుచున్నారు. కేవలము మీ తాతగారొక్కరే కాదు. మీ వంశమునఁబుట్టిన పెద్దలందఱు మిగుల ధర్మబుద్ధిగలవారలు. ఎప్పుడో గతించినవారి సంగతి యెందులకు! మీనాయనగారి విషయము మీకుఁ దెలియనిదిగాదు. కల్పవృక్షమువంటివాఁడు. పాపము: అడిగినవస్తువాయన నోటికోలే

దనఁజాలఁడు. ఆయనయిచ్చిన మాన్యపుభూములు బ్రాహ్మణులెన్నివత్సరములనుభవించినను గొఱతపడవు. అట్టిధర్మాత్ముని కడుపుననాయన చేసిన దానఫలమేమో యనునటుల సుపుత్రులుమీరుజనించినారు

మీరును మీతాతతండ్రులకుఁ దీసిపోవువారుకారు. చిరంతనమునుండి మీరుధర్మపరులై పెద్దలఁ బ్రాహ్మణుల నెల్లగౌరవించు చున్నది. లోకమెఱింగియేయున్నది. ఇంటికివచ్చిన బ్రాహ్మణునకే వరహాలా, యేమాడో, యియ్యక యూరకపంపుచుండుట నేనింత వఱకుఁ గనివిని యెఱుగను. మెఱుగుపెట్టఁబడిన బంగారుమాడ్కి మీవంశము మీకతన నింతకంటె మిగులవాసికెక్కెఁగాక.

ఇన్నిపలుకులుపలికి యావిప్రుఁడు మిన్నకున్నతఱి నమూయాఖ్యుఁ డగు నాశూద్రుఁడాహ్లాదిమధురరసాస్వాదముఁబోల్కి విప్రప్రోక్త స్వవంశానుతివచనంబులంగ్రోలి వివశుఁడై లోనుప్పొంగి లేచి.

“అయ్యా! నాచేయుకార్యంబెద్దియైనఁగలదేని వచింపుఁడు. సత్వరంబాచరించెదననఁగ” నామూయావిప్రుఁడా పలుకాలించి తన కార్యముచేకూరెనని డెందంబున సంతసించి “విశేషకార్యమేమియు లేదు, నేనునిస్సహాయుఁడను, మీవలన చిన్నసహాయముంగోరి యీ కడకేతెంచితి. ఆపనిమీవలనఁ దప్పక కాఁగలదనినాకు మెండాశగలదు. అద్దానిని మీరు నెఱవేర్చెదరని వాగ్దానమొసంగినచోఁ జెప్పెదనని యతనివలన నట్లయనువచనమును గ్రహించి తన యాకాంక్షకార్యము నుడువఁబూనుకొనెను.

నాపుత్రునకుఁ బెక్కుదినములకు దైవయోగంబున వివాహ మొనఁగూడినది లగ్నము పదిదినములుమాత్రమేకలదు. కన్యాశుల్క-



మునకు వేయి రూప్యములిచ్చునటుల నొడఁబడితిని. ధర్మపరుఁడగునాగయ్యగారొక వందరూప్యంబులు పుల్లయ్యగారొకవందరూప్యములొసంగియున్నారు. ఇంకనచ్చటచ్చట నాలుగయిదువందలుచిక్కినవి. కన్యాశుల్కమునకుఁగా నియ్యవలసినధనమునకే చాలకొఱతపడి యున్నది. నేనేవిధముగా జీవయాత్రసేయుచున్నదియు మీకుఁదెలిసియేయున్నది. నాలుగయిదు క్రోశముల దూరమైన బ్రాహ్మణార్థమునకు వెళ్లుచుం గాలము గడుపుచుంటినేకాని యొకనాఁడైన నింటియొద్ద భుజించి యెఱుగను. సంభావన ధనముతో గృహమును జక్కఁబెట్టుకొనుచుఁ బుత్రునకుఁ జదువు జెప్పించుకొను చుంటిని.

కావున నాకన్యాశుల్కమునకుఁగాను కోరవడిన ధనమొసంగి నన్ను గృహస్థునిగాఁ జేయఁగోరుచున్నాను. ఈవివాహమంతయు మీచే జరుపఁబడినట్లే యనుకొందును. దీని ఫలమంతయు మీకే చెందునని యాయగ్రజనుఁ డాశూద్రుని మనోలతను దనకనుకూలముగాఁ జేకొని యతనిచేఁ బ్రతిగ్రహముం గ్రహించి స్వకార్య నిర్వహణం బొనరించుకొనును.

దాత శుభదినంబులఁ దెలిసికొనుట కెన్నడైన నాపుడమివేల్పు నింటికేఁగి నపుడా విప్రుఁడున్న తాసనంబున సుఖావిష్టుఁడయియుండియు నాదాత నేకటముమీఁదనో (లేక) భూమిమీఁదనో కూర్చుండ నాజ్ఞాపించును. దప్పిఁగొని జలమడిగి నపుడు మడితోనున్నారు ఇప్పుడు వీలు గాదని చెప్పును. లేదా! వారు బహిర్దేశమునకై పట్టుకొని పోవు నట్టియు, నెన్నడును శుభ్రపరచనట్టియు, నొక మడ్డిచెంబులో నుదకము తెచ్చి యిచ్చును.

ఈవిధముగా బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులపై నాధారపడియు నింద్య పుట్టించునట్టియు, మోహజనకములగునట్టి మాటలతోఁ వారి మనోభావముల దమకు స్వాధీనముచేసికొని స్వాంతవలనఁ దమ కార్య నిర్వహణం బొనరించుకొనుచుండిరి.

బ్రాహ్మణేతరులపనిఁ దీర్పవలంపచ్చి నప్పుడనాదర భావముతోఁ సంకుచిత దృష్టితోఁ జూచుచున్నారని చెప్పుటకెంత మాత్రము సందియము లేదు

మఱియు బ్రాహ్మణేతరుల యిండ్లలో శుభాశుభ కార్యములు సంభవించినపుడు "దానము నిచ్చినఁ బుణ్యములు చేకూరును. వంశ వృద్ధియుఁ గలుగును" అని చెప్పి వారి ధన ధాన్యములను గ్రహింతురు. విఘ్నేశ్వర పూజా పుణ్యాహః వాచకాది నామములతో దక్షిణలును, బ్రాహ్మణులను పేరుతో సంభావనలును సంగ్రహింతురు. అసమయమున దాత బీదతనమున దక్షిణ సంభావనలను దక్కువగా నియ్యబూనినచో నింటి పెంకులు రాలునట్లు భూమ్యాకాశములు వ్యాపింపఁగొప్ప కేకలు వేతురు. ఒకొక్కసారి చేతులు, చేతులు కలియునంతటి యవసరముకూడ తటస్థించును. అటుల బ్రాహ్మణులచే దెబ్బలుతినిన బ్రాహ్మణేతరులు మాకొల్లూరు పురమున నిప్పటికి నున్నారు.

ఆశ్రితులమను నెపంబున సౌమిత్రి కట్నాల్లు, స్వర్గ నెపమున దశదానములు స్వీకరించుచున్నారు. చెవులు కుట్టించునపుడు, కేశఖండనమపుడు, బాలురకు నన్న ప్రాశనము చేయునపుడు, శుక్రవారపు నోములు నోమినపుడు, మంగళవారపు వ్రతము లాచరించినపుడు, గృహప్రవేశము చేయునపుడు, గర్భాదాన సమయమందు, చచ్చినపుడు



మొదలినపుడు, కదలినపు డేదో యొక నెపంబున వారికి దానాపరనామముతో విధిగా శిస్తులు చెల్లింపవలసినదే. పాలకుల కియ్యవలసిన శిస్తు నెప్పుడైన నొకతూరి నేదో యొకవిధమునఁ దప్పించుకొనవచ్చునుగాని వారికియ్యవలసిన శిస్తు నెన్నియిక్కట్టులు సంభవించినఁ దప్పక చెల్లించి తీరవలసినదే.

ప్రతి సంవత్సరము బ్రాహ్మణులకుఁ జెల్లింపవలసిన శిస్తు రాజ్యాంగమువారికిఁ జెల్లింపవలసిన శిస్తును మించియున్నదని సప్రమాణముగా నిరూపింపవచ్చును. పరిపాలకులు మనలనుండి శిస్తును గ్రహించియు వేఱొక విధముగ మనకుఁ గొంతవఱకైన సౌఖ్యములఁగలుగఁ జేయుచున్నారు. ఈభూదేవతలట్లుగాక మనసొత్తెల్లయు గుత్తగొనుచు మనకు దాస్యభావము నీచభావము నొసంగుచున్నారు

వివాహ సమయమునఁ దుదకుఁ బురాణోక్తమైన నైదు దినములు హోమము చేయవలయునని పురాణోక్త ప్రకాశిక ఘోషిల్లుచుండఁ గన్నెఱికము భాతి నొక యరగింట మాత్రము క్రతువు జరిపి (ఇంక దక్షిణ సంభావనలకు నొకపావుగంట తీసివేయవలసియుండును.) యయిదు దినములు వృథాడంబరముతో సొమ్మంతయు వ్యర్థవ్యయము చేయించుచున్నారు. మంత్రములని యేతద్దినముల మంత్రములనో పఠించుచు మధ్య మధ్య యజమానుల యిల్లము పల్లవింపఁజేయుటకు "తాటివండ్ల గోత్రము (ఫలాని) రామయ్య, ముట్లూరి గోత్రము (ఫలాని) పున్నయ్య, మున్నగు నామములను మహార్భాటముతో నెలుగెత్తి పెద్దపెద్ద కేకలు వేతురు. బ్రాహ్మణుల ముఖమునుండి యుచ్చరింపఁబడిన తనకున్న నామగోత్రములను వినినంత మాత్రముచే నమా

లేక ప్రవర్తనులగు శూద్రులు చిన్నచిన్న నగవులతోఁ బలుకుకొనుచుందురే కాని నిజమెంతయో యారయ నసమర్థులగుచున్నారు.

బ్రాహ్మణులకున్న గోత్రము ఋషిసాంప్రదాయము ననుసరించి పెట్టఁబడినట్లు గోచరమగుచున్నది. వీరికున్న గోత్రమో! యేగ్రామదేవతనో యేతాటి గింజనో, యేయీత విత్తునో, యేచెట్టుపుట్టనో, యేరాతినో యనుసరించి పెట్టఁబడినటులఁ దెల్లమగుచున్నది. నేను చెప్పునది యసత్యమని మీకుఁ దోఁచినచో మీగోత్రనామమును బ్రాహ్మణుల గోత్రనామమును నొకసారి మనసులో స్మరించి విచారించి చూడుము. అంతయు నొరులు చెప్ప నవసరములేక మీకే విశదమగును.

ఇఁక నపరకర్మల విచారించి చూతము. దేహమును విడిచిన యాత్మశాంతికై యపరకర్మలు కల్పింపఁబడినవి. మరణానంతరమున జీవుఁడు స్వర్గలోకమున కేగునో, పితృలోకమున కరుదెంచునో, యమలోకమునకుఁ బోవునో, రాక్షసలోకమున వసింపఁజనునో; పాతాళమున కేగునో లేక నరలోకమునకే యరుదెంచునో మఱొకచోటికి వెంచేయునో తెలిసికొనుట మిగుల దుస్తరముగదా! ఒక్కొక్క లోకమున కరిగిన యాత్మకు నొక్కొక్క విధమగు క్రియ జరుపవలయునని వైదిక మతచట్టము వ్యక్తముచేయుచున్నది. ఆచట్టమునకు బద్ధులమై యట్లు చేయుటకు సంసిద్ధులమై యున్నతఱి స్వర్గ పితృలోకమున కేర్పరచిన యాకర్మల జరుపవైగి. స్వర్గాది పుణ్యలోకముల బ్రాహ్మణేతరులు పొంద నర్హులుగారనియా వారిభావము? అటులయినచో బ్రాహ్మణేతరులుసేయు నీకర్మములకును, వారొసంగిన దానధర్మములకును ప్రతిఫలమేమై యుండును.



మరణానంతరమున జీవునకు లోకాంతర కల్పనయు నాత్మశాంతి జకుఁ గ్రియాచరణ కల్పనయు, నాక్రియాచరణ సమయమున య్యఁబడిన దానములకు బ్రాహ్మణులే యర్హులగుదురను కల్పనయు బ్రాహ్మణులే కల్పించిరని వెనుదీయక నుడువుచున్నాను. మరణానంత రమున నాత్మ యెందేగునది యెవ్వఁడు తెలిసికొనలేఁడు. కర్మాచరణ మున నియ్యఁబడిన దానము మాత్రము వేంకటేశ్వరస్వామివారి ముడు పునకువలె వారికి నిరభ్యంతరముగా ముట్టుచున్నది.

వారు క్రియ నవిదముగా జరిపినను దానగ్రహణమునకుఁ బ్రతి లము బొత్తుగా పొందలేదని చెప్పుటకు వీలులేదు. క్రియాచరణ మయమున బ్రాహ్మణుఁడెల్లయ్యదాసు పుల్లయ్యదాసు అని యుచ్చ ంచుటయే తమపెద్దలకు పుణ్యలోకమున కనిపినంత ప్రతిఫలము చ్చుచున్నది. అదియే దానఫలము, బ్రాహ్మణేతరులలోఁ బెక్కురకు బ్రాహ్మణుఁడటులనే నామోచ్చారణము చేసినంత మాత్రముచేతనే తమ పెద్దలు తరింతురను దృఢనమ్మకము గలదు

అట్లు జన్నిగట్లు శూద్రులను "దాస" యని పిలుచుటకు వారి యుద్దేశమేమియో యించుక పరిశీలింతము.

శ్లో॥ ధ్వజాహృతో భక్తదాసో గృహజః క్రీతదత్త్రిమౌ।
పైత్రికో దండదాసశ్చ సప్తైతే దాసయోనయః॥

యుద్ధమందు జయించి తేఁబడినవాఁడు ధ్వజదాసుఁడు. భక్తుడై సుఁడైనవాఁడు భక్తదాసుఁడు. దాసీపుత్రుఁడు గృహజుఁడు. కొనఁ డినవాఁడు క్రీతదాసుఁడు ఒకరిచే నీఁబడినవాఁడు దత్త్రిముఁడు,

పిత్రాది క్రమాగతుఁడు పైత్రికుఁడు. దండాది ధనశ్శుద్ధికొఱకు స్వీకృ దాస్యుఁడు దండదాసుఁ డీయేడును దాసత్వమునకు మూలములు. పైఁజెప్పఁబడిన యేడు విధములలోను బ్రాహ్మణేతరులు భగవద్భక్తు యున్నందున భక్తదాసులగుదురు గాన వారి కర్మకలాపములందును దాస శబ్దమును బ్రయోగించుచుంటిమని బ్రాహ్మణులు చెప్పుచుంద్రి భగవద్దాసులు గానివారెవరు? ప్రతి మనుజుఁడును భగవద్దాసుఁ డయ్యుండ కేవలము బ్రాహ్మణేతరులనే (శూద్రులనే) దాసులని పిల్చు టకుఁ గారణమెద్ది? కర్మాచరణమునందే దాసుఁడనిపించి యితర స మయములందట్లు పిలువకుండుటకు హేతువెద్ది? దాసశబ్దము ద్వివిధముగ వ్యవహరింపఁబడుచున్నది.

1. మనమిచ్చిన గుడ్డకట్టుకొనుచు మన మొసంగిన కూడుగు డుచు మనము చెప్పినపనిని జేయువానిని దాస యనిపిలుతుము.

లేక జీతము బత్తెమియ్యక పోయినను మనమాటలో మెలగుచు మన కార్యము చేయువానిని దాస యనిపిలుచుటయు వాడుకకలదు.

2 నిరతమును భగవద్ధ్యానపరుఁడై యున్నవానిని దాస యని పిలుతుము.

బ్రాహ్మణాది చాతుర్వర్ణజులలో నెవఁడైన నిరతము నీశ్వ ధ్యానాసక్తుఁడయి యుండెనేని వానినవశ్యము దాసయని యుపనామ ముచెప్పుట ప్రసిద్ధమయి యున్నది. (ఉదా=రామదాసు=కబీరుదాసు

మన సేవ సేయువానిని (నాదాసుడని) యితరులతోఁ జెప్ప దుము పిలుతుము గాని యితరులుమాత్రము (దాస) యనిపిలువరు పిల వఁజాలరు.



కావున బ్రాహ్మణులు శూద్రులకు జీతము లియ్యకపోవుటయే కాక వారినుండియే ధనగ్రహణముఁ జేయుచు వారిని దాసులనిపిలు చుచు వారియెడనీచత్వము, నల్పత్వమును ద్యోతకముఁ జేయుచున్నారు ధనగ్రహణ పారీణులారా? ఇయ్యది యెంతయుచ్చెరువు గల్పించుచు న్నదో విచారింపుఁడు. తల్లిచనుపాలు త్రాగి రొమ్ముగ్రుద్దినట్లుమనవలన ధనాపహరణముఁ జేయుచు మనల నెట్టిభావముతోఁ జూచుచున్నారో యాలోచింపుఁడు.

ఈవిషయములన్నిటిని బరిశీలించి చూడ శూద్రులు భగవద్భక్తు లైన కతమున దాసశబ్దము ప్రయుక్తముగాదనియు వానినట్టులఁ బ్రయోగించుట కుహేత్వంతరముండెనని తెలియుచున్నది.

శ్లో॥ శర్మవద్బ్రాహ్మణస్య స్యాద్రాజ్ఞో రక్షాసమన్వితం।
వైశ్యస్య ధనసంయుక్తం శూద్రస్య ప్రైష్యసంయుతమ్॥
మనుస్మృతి అ. 2. శ్లో॥ 32

దీనియందు పవరి నియమమును జెప్పుచున్నాఁడు. బ్రాహ్మణు నకు శుభశర్మ, క్షత్రియునకు బలవర్మ, వైశ్యునకు వసుభూతి, శూద్రు నకు దీనదాస అని యిట్టివిధముగ నర్థముగల నామములుంచ వల యును.

దాసయను పదమునకు దీనపదమును పర్యాయపదముగానుంచి యర్థా ని బ్రాహ్మణేతరుల యెడన్ దింపఁజేసిరి. దీనత్వము బ్రాహ్మణేతరుల కెందువలన గలిగెనో విచారించుట యప్రస్తుతముగాదు.

“వృత్తి” యను నుపోద్ఘాతమం దుదాహరింపఁబడిన కల్పిత ప్రమాణముల నరయ శూద్రులు బ్రాహ్మణ సేవనుపేడి యుపరకృత్యము

లాచరింపరాదని శాసించుచున్నటుల స్పష్టపడుచున్నది. గత వివరణములఁ గల్పిత ప్రమాణములంజూడ బ్రాహ్మణేతరు లందఱిని శూద్రులనుగా నిరూపించినటులఁ దెలియుచున్నది. అందువలన శూద్రులగు బ్రాహ్మణేతరులు బ్రాహ్మణసేవఁ నాచరణీయముగా నాచరింపవలయుననియు, బ్రాహ్మణసేవఁ జేయువారిని బ్రాహ్మణులు 'దాస' యని పిలువవచ్చుననియు, సిద్ధాంతమగుచున్నది. కావున నాసిద్ధాంతమే బ్రాహ్మణేతరుల 'దీనదాస' యని పిలుచుటకు మూలకారణంబై యున్నది గాఁబోలు. ఈవిషయమున విపులచర్చ జరుపుటకు గ్రంథవిస్తరమగునను భీతిచే నావిషయము నుపసంహారముఁ గావించుకొనుచున్నాను.

ఈవిషయములచేఁ బ్రాహ్మణేతరులకుఁగల ప్రతిఫలమేమన బ్రాహ్మణేతర జాతులన్నియు శూద్రజాతులగుట, అందులోఁ గొందఱికైన 'దాస' యను బిరుదులభించుట, అబిరుదుపొందిన కొంతమంది యయ్యది యెంతయో గౌరవాస్పదమని విద్వద్బిరుదములఁ బొందిన వారికంటె మిగుల మురియుచుండుట అట్టి మురియువారు సజ్జనులనియే పరీక్షింపవచ్చును. కాని స్వాభిమానము దూరమై, నిష్కళంక పరాభిమానము పటాపంచలై బూటకపు పరాభిమాన ముదయించును అయ్యది స్థిరరూపము దాల్పనేరదు. కావున సజ్జనత్వముగూడ స్థిరరూపముఁ దాల్పలేదని గ్రహించుట యుత్తమమార్గము. స్వాభిమానము సంపాదింపఁ దలంపు, సాధుత్వము సంపాదింప నభిమతము, గౌరవము బడయు గోరికయున్న నీగ్రంథము నామూలాగ్రము పఠించియందలి గుణమును గ్రహించి గౌరవార్థిక మనోస్వాతంత్ర్యకారణము



లగు బ్రాహ్మణ వాక్యములకు లోనుగాక సౌజన్యముతో శాశ్వత శ్రేయస్సును బడయుదురుగాత.

## చేఁతలు.

ఇంతవఱకు నుదాహరించినవి బ్రాహ్మణుల వ్రాతలు. వ్రాతలు వ్రాసినంత మాత్రమున బ్రాహ్మణేతరులకుఁ గల్గినహానియేమి? బ్రాహ్మణులకుఁగల్గిన లాభమేమని కొందఱందురు; వ్రాతలేగాదు. చేతలు నందు కనుకూలముగనే యున్నవని యీక్రింద నుదహరింపఁబడు విషయములచే విశదముగాఁగలవు.

త్రిలింగ పత్రికయందు బ్రస్తుతమున్న క్షత్రియులు 'క్షత్రియులు గారనియుఁ పరశురామునిచే క్షత్రియ పురుషులు హతులుగాఁగా బ్రాహ్మణులవలన క్షత్రియ స్త్రీకిఁ గల్గినారనియు, వాదించి యున్నారు. కమ్మ, వెలమ, రెడ్డి, బలిజ మున్నగు శాఖలవారిని గుఱించి నేటికిఁ బది వత్సరములనుండి శూద్రులని వాదనఁ జేయుట, 'వారిని శూద్రులనుటకు వీలుగా కర్మలోపంబుతో నుంచుటయు, జగమెఱింగినదే. కోమట్లను గురించి బందరునందు జరిగిన కలహముల నెఱుగనివా రెవరుగలరు? పద్మసాలీలను గురించి జరిపినచర్చ నెవరు మఱచిరి? శివార్చకులకు విష్ణ్వార్చకులకు జరిగిన తాంబూలపు తగాదాలను గురించి బ్రాహ్మణుని వలన నుంపుడుకత్తెగాఁ బరిగ్రహింపఁబడిన బ్రాహ్మణ స్త్రీకిఁగలిగినవారు శివార్చకులనియు, బ్రాహ్మణునివలన క్షత్రియ స్త్రీకిఁ గలిగినవారు వైఘానసులనియుఁ జెప్పిన తీర్పు ఇప్పటికిని మాసిపోలేదుగదా! నిజము తెలియదుగాని దేవాంగులను గురించియు నటులనేయనుటకుఁ దగు

కృషిఁ జేసిరని వింటిమి. కూనపులి పూర్ణయ్యశాస్త్రిగారు కమ్మవారు శూద్రులనియు, సంస్కృతము చదువరాదనియు, కృష్ణాజిల్లా కమ్మవారికి రిజష్టరు నోటీసిచ్చిన దబద్ధమా! పాఠశాలకు కమ్మవారివలన నమితమగు చందాలు వసూలుచేసియు అమృతలూరినుండి వచ్చిన కమ్మ విద్యార్థిని కొవ్వూరి పాఠశాలలోఁ జేర్చుకొనని సంగతి నిన్న మొన్ననే గదా జరిగినది! ఇట్లితరుల నధోగతిపాల్జేయు స్వభావముగల కులము లోని యంతఃశాఖలపైకేఁగక మానుకొనునా?

కాయస్థులను, నియోగులనుఁ బెక్కుచిక్కుల బెట్టుచున్నదదియే గదా! దొంగలు దొంగలుగలసి యూళ్లు పంచుకొను చందంబునఁ దమ లోఁదమకు భాగములు కుదురకపోవుటచే నితరులను బాధచేయు స్వభావము ననుసరించి వెలనాటి శాఖను గురించి మురికినాటి శాఖవారును మురికినాటి శాఖను గురించి వెలనాటి శాఖవారును పరస్పరము దోషారోపణముఁ జేసికొనుచున్నారు. ఇంతయేల

శ్లో॥ ఆరూఢపతితం విప్రంమండలాచ్చ్యుతినిస్సృతం।
ఉద్బద్ధంకృమిదష్టంచ స్పృష్ట్వాచాంద్రాయణంచరేత్॥

అనగా కర్మభూమినుండి ద్వీపాంతరములకు బోయినవారిని స్పృశించగూడదని శాసించి తద్విధానమును అమలులో బెట్టుచున్నది సర్వులకు విదితముగదా? అది యటులుంచుడు. వర్తమానకాలంబున దేశసౌభాగ్యాభివృద్ధికై పలుబాధల ననుభవించుచు నిరంతరము తత్కృషి జేయుచు విదేశీయులచే నయితేను మహాత్మాయని పేర్కొనంబడ జేసిన సౌజన్యమార్గానువర్తియగు మహాత్మా గాంధిగారిని దేవాలయ ప్రవేశమున కర్హుఁడని చెప్పి కన్యాకుమారి దేవాలయములోనికి జననివ్వక



యడ్డుపెట్టినది యబద్ధమా? యాకన్యాకుమారి చరిత్రమేమి? యామె పరిశొత్తా? ఇట్లవసరము గల్గినప్పుడెల్ల నెంతటివారికైన నిట్టి మాయా కల్పితశాస్త్ర వచనములకు బద్ధుల జేయుటకునై వారు చేయుచేతలెన్ని యోగలవు. యాకల్పిత శాస్త్రవచనముల పారద్రోలినగాని దేశీయులలోగల యంతఃకలహపిశాచము హరించదు యాపిశాచము హరించిన గాని యైకమత్యం బొదవదు. యైకమత్యం బొదవినగాని స్వరాజ్య సంపాదనగల్గదు.

ఒరులను జెరుపఁగోరి తాము బాగుపడనెంచిన జనసముదాయములోఁ బ్రతివ్యక్తియు నొకరికి మాఱియొక రొరులగుదురుగదా? అట్లైన నప్పుడా కుమతివారిలో వారినటులఁ జేయుటకు సందియమేమి? దానిని వెంటనే నాశనముఁ జేయకున్న మిగుల ననర్థకము లుద్భవించుననుటకు సందేహము లేదుగదా. ఇంతయేల! ఒక్క విశ్వబ్రాహ్మణులను గుఱించి ద్విజులుగారనియు, వేదాధికారము లేదనియు, జరిపిన తగాదాలు సుమారు డెబ్బది కెక్కువ ప్రస్తుతపు పరిపాలకులు విచారించియుండగా బ్రాహ్మణులు వ్రాతలు వ్రాసిరిగాని చేతలు జేయలేరనుట యెట్లొప్పియుండును? శూద్రులకు వేదాధికారము గలదనినంతమాత్రమున శ్రీమత్ పరమహంసస్వామి జి. యస్. బి. సరస్వతీగారికి నాసేతుహిమాలయమువఱకు వ్యాపించియున్న బ్రాహ్మణులలో నొక్క బ్రాహ్మణుడైన నొక్కపూటకైన బిక్ష పెట్టక యుపవసించజేయుటకన్న ఘోర మెందుగలదే! పెక్కువాదములేల? వెలమ, కమ్మ, రెడ్డి, బలిజ శాఖలవారిలో నెవరైన నొకరు వారి మనోనిశ్చయము దెలియుకొఱకు బ్రాహ్మణులచే నుపనయనముఁ జేయించుకొని వేదపాఠము నేర్చినచో

నే జేసిన కార్యమంతయుఁ దప్పని చెప్పుకొందును. అట్లుగాక వ్యర్థవా ములు జేసిన నే నొప్పుకొనఁజాలను. ఇంతమాత్రము సాంఘిక సత్వమును సంపాదింపలేదని ధూర్తిగా నొక్కి చెప్పవచ్చును. మాకే వేదములు జన్మ వలయునని తలంపు లేకపోవుటంబట్టి బ్రాహ్మణులవలన వేదము అభ్య సింపమానితిమని బ్రాహ్మణ శిష్యులు కొందరు నుడువవచ్చును. యున వేదాభ్యాసపరులగు మావారికి బ్రాహ్మణులచే వేదము నేర్ప చిన మిగుల సమంజసముగా నుండును.

౬౦.

## వశీకరణము.

సహృదయులారా !

మనమింతదనుక పరిశీలనము జేసిన సిద్ధాంతముల ననుసరించి చూచిన బ్రాహ్మణేతర జీవికయను రథమునగల పౌరోహిత్యమను నొగ యందు సారథియై బ్రాహ్మణుడు కూర్చుని తన నిరుద్యోగ జీవికాను కూల మాయాకల్పిత శాస్త్ర వచనములను కోలచేఁబూని తద్వారా బ్రాహ్మణేతర నేంద్రియములను నశ్వముల స్వాధీనము చేసుకొని యారథము నజ్ఞానసముద్రము యొక్క మధ్యకు గొంపోయి యికనావల దరి జేర్చుటకు బ్రయత్నించుచున్నాడు యారథ మావల దరిజేరనచో నల్పత్వ నీచత్వభావములు పెంపొందించి మరలనీ దరి జేరకుండు లాగున తగు ప్రయత్నము జేసి వాంఛితమీడేర్చుకొనునని సుబోధకంబగుచున్నది. యందుచే బ్రాహ్మణేతరజీవికయను రథమునకు దుర్బుద్ధితో సారథియై యున్న నా బ్రాహ్మణుని పదభ్రష్టునిగావించి, నారథమునకు సారథి



ముఖ్యావశ్యకంబగుటచేత, యాస్థానమున యనుకూలురనుంచి మెల కువతో కృషి జేయుట ప్రథమ కర్తవ్యంబైయున్నది. గాని యెవ్వరైన నబ్రాహ్మణుల మార్గావరోధము గావించుటకు బూనినచో వారిని లాలించియో బెదిరించియో తమ కష్టసాధ్యంబులగున జేయుదురు. అనునులాపంబులకును బెదరింపులకు నతఁడు తనతనపౌంపడుఁడు గానిచో మునముదుసలులైన యతని తల్లిదండ్రులకడకేగి "పెద్దలైన బ్రాహ్మణుల నీపుత్రుఁడు ద్వేషింపుచున్నాఁడు పాపము చుట్టుకొనును వంశనాశనమగును"ని వారిమనముల భీతిజనింపఁజేసి తమకు స్వాధీనముఁ జేసికొని వారిపుత్రునిఁ దనకష్టసాధ్యంబు నటుల వారిచేఁ జెప్పించును.

స్వజనుల మాటనతిక్రమించి యెట్టిపనిఁ జేయుటకు నేనికైన నసాధ్యముగదా! బయటిపోరుకంటె నింటిపోరెక్కువ పనిచేయును. అట్లు స్వజనులమాట నతిక్రమించినవాఁడేపనిచేసిన నయ్యది కొనసాగ నేరదు. ఒకపక్షమున స్వబంధువులడ్డు రాకపోయినచోఁ దనకులము వారితోఁ జెప్పియైన వానియెడ వారికి ద్వేషభావము జనింపఁజేయును.

తన సంఘదూరుఁడైనవాఁడు నేలవిడిచి సాముచేయువాని వగది పతనహేతు భూతుఁడగును. ఈపగిదిఁగల్పిత శాస్త్రవచన సాహాయ్య ముతో లాలన భీకరవచనములతో బ్రాహ్మణేతరుల మనోలతను హస్త గతము గావించుకొనిరి. అందుకతన వారేమియుఁ జేయక పనులన్నియు నితరులచేతనే చేయించుచున్నారు

అట్లు మచ్చునకై కొన్ని యుదాహరణము లిందుఁ బొందుఁ బఱచుచుంటిఁ జిత్తగింపుఁడు.

కొల్లూరు సమీపమున నున్న మొనలిపాడు అను గ్రామమున భూపతులు, ధనవంతులు, కమ్మ కులజులునగు వ. నాగయ్యగారికి రాచపుండు లేచినది. అట్టితఱి నూఱు రూప్యములొసంగిన నా వ్రణము బాగు పఱచెదనని వైద్యుఁడు చెప్ప ధనలోభంబున నూరు రూప్యము లీయక యాకురుపు బాగుచేయించుటకు వెఱచిరి. పిదపఁగొన్ని దినములకా రాచకురుపువలన వారు (నాగయ్యగారు) స్వర్గస్థులైరి.

అట్లు మరణించిన నాగయ్యగారి యాత్మశాంతికై కర్మకాండంబున బ్రాహ్మణ సంతర్పణాది కార్యములకు వేయి రూప్యములు వ్యయముచేసిరి. బ్రతికియుండఁగా నూరు రూప్యములు వ్యయముచేయుటకు వెఱచినవారు మరణానంతరమున నాత్మశాంతి గలుగుటకై వేయి రూప్యములు వ్యయ పఱచిరి. అట్లు వ్యయముఁ జేయించిన దేనూత్రమో పాఠకులే విచారింతురుగాక.

మఱియుఁ [illegible]యను గ్రామమున నొక కమ్మకులజుఁడు తనపుత్రి వివాహమును వేదోక్తముగా జరుప సంతసమునఁ బూనుకొని తన పురోహితున కావిషయముఁ దెలియఁజేసెను. అంత నా పురోహితుఁడు వల్లెయని తన సమ్మతిఁజూపెను. అనంతరము రెండవ దినమునఁ బెండ్లికొడుకు తన వివాహమును వేదోక్తముగా జరిపిన ''నేనూతిలోనో, యేనదిలోనో పడి యాత్మహత్య గావించుకొనెదనని పట్టుదలతో వేదోక్త వివాహమున కియ్యకొనక పురాణోక్తముననే తన వివాహమును గావించుకొనెను. అటుల వరుని మనమును గలతపెట్టిన దేనూత్రమో చదువరు లూహింతురుగాక.



పెక్కు మాటలేల! తన కడుపున నుద్భవించిన పుత్రులకు విద్య నేర్పుటకు ధనవ్యయమగునని భీతిలినవారలు శుభాశుభకార్య పంబున నెంతెంత సొమ్మును వృథా వ్యయముఁజేయుచున్నది లో మెఱుంగనిదికాదు.

ఈపగిది స్వపోషణమునకు, స్వకుటుంబ పోషణమునకు, స్వపుత్ర విద్యాభివృద్ధికి, ధన వ్యయమగునని జంకు బ్రాహ్మణేతరులు ''స్వర్గము, వంశాభివృద్ధి, అపవర్గము, మున్నగునవి విప్రసహాయంబునఁ గలుగు''నని రత్నకోరికలతోఁ బరువులెత్తి శక్తికిమించిన ధనవ్యయముఁ జేయుచున్నారు. ఇందుకు నిదానం బేమని విచారింప రజకుఁడు సల్లకిఁ జేయుటకు వృషము నంకురావసరముననే తనకనుకూలమగునట్లు వంచుటకు మొదలిడినట్లు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణేతర మనోలతను చిఱుత ప్రాయమునుండి తనకనుకూలముగాఁ జేసుకొనుటయే ప్రధమ కారణముగా నగపడుచున్నది, గాని కారణాంతరము గాన రాకున్నయది.

ధన విద్యా గౌరవాదుల సంపాదించవలెనని, మనోస్వాతంత్ర్యమును సంపాదింపవలెనని, బ్రాహ్మణ విష మహీరుహము నల్లిబిల్లిగఁ జుట్టుకొనిన బ్రాహ్మణేతర మనోలత నావిషమహీరుహమును వీడవలె. స్వసహాయముతో సంచరింపవలె. విషవృక్షము నాశ్రయించియుండుటవలన నాలతకుఁగూడఁ గొంత విషము వ్యాపించియున్నది.

కావున నావిషము వాపుకొనుటకు స్వయముగా యత్నింపవలె. స్వయముగాఁ బాపుకొనుటకు శక్తిజాలనిచో మంచిమందుఁ బుచ్చుకొనియైనఁ బోఁగొట్టుకొనవలయును. ఆవిషమాక్రాంతమై యుండునంత

వరకు నాలత వృద్ధిబొందఁ జాలదు. యీవిషకారణమునకు సంయోగ్య హారణమే సుమార్గము.

స్వేచ్ఛ నవలంబించుటకు నెప్పటియట్లఁ బౌరోహిత్యాది కృత్యములు బ్రాహ్మణులచేఁ జేయించుకొనుచు, నందుకతన వారియెడ సేవక భావముంచుచు, నిదేవిధమున వారియెడఁగల నగ్రజాత్యాద్యుత్కృష్ట భావమును, దమయందుఁగల నీచత్వాద్యల్ప భావమును, రూపుమాపినఁ జాలునని బ్రాహ్మణేతరులు గొంతమంది చెప్పెదరు. స్వాభివృద్ధికిఁ బాటుపడఁజాలని బ్రాహ్మణేతర మనములు, బ్రాహ్మణులకిచ్చు దాన ధర్మములతోనే తమ పితరులకు స్వర్గాదిమోక్షములు లభించునని తలంచు బ్రాహ్మణేతర మనములు, బ్రాహ్మణులయందలి పూర్వ భావములనుండి మారలఁజాలవని ఘంటాపథముగా నుడువ వచ్చును.

రాజకీయోద్యోగములచే బ్రాహ్మణేతర సంఘము నుద్ధరింతుమని తలంచు బ్రాహ్మణేతర సహోదరులు గొంతమంది గలరు. అదియు వమ్మేయని బ్రాహ్మణేతరుల నడకలే చెప్పుచున్నవి.

బ్రాహ్మణ బ్రాహ్మణేతరుల నడవడినరసి బ్రాహ్మణేతర మనోలతకుఁ జేయూత నొసంగుటకు, స్వేచ్ఛ నొసంగుటకుఁ, బురోఽభివృద్ధిఁ గావించుటకును దేశోవంతము, స్వసంఘ పౌరోహిత కృత్యమొకటియే యాదర్శప్రాయమై వెలయుచున్నది. కావున నద్దానిని స్వీకరించి స్వసంఘ గౌరవార్ధికాభ్యున్నతికిఁ దోడ్పడుదురని బ్రాహ్మణేతరుల వందన శతంబులతోఁ బ్రార్థించుచున్నాను.



# సారాంశము.

ఈ గ్రంథమునందుదాహరింపఁబడిన ప్రమాణ వచనంబులు బ్రాహ్మణ కల్పితములు. ఇట్టి ప్రమాణములు పెక్కులుగలవు. మచ్చునకై కొన్ని మాత్రమేయిందుఁ బేర్కొనఁబడినవి. ఇందలి సారాంశమేమన.

బ్రాహ్మణేతరు లందఱును శూద్రులు. ఆశూద్రులును పరబ్రహ్మ పాదోద్భవులుకారు. సంకరులయియున్నారు. వారువిద్య నార్జింపరాదు. ధనమునార్జింపరాదు. ఒకతఱి నార్జించినట్లైనయెడ ధనమును బ్రాహ్మణుల కొసంగవలయును. బ్రాహ్మణ సేవతక్క వేఱు కార్యము లాచరింపరాదు. మోక్షాపేక్షచే జప, తప, యాగాది కార్యములు సేయరాదు. బ్రాహ్మణోచ్ఛిష్టమును భుజింపవలయును. బ్రాహ్మణులచేఁ గట్టఁబడి, చినిగినగుడ్డలు కట్టవలయును. ఈమాసిన గుడ్డలును వారిదయచేతనే సంపాదింపవలయును. బ్రాహ్మణుల ధిక్కరించిన వేదాధ్యయనముఁ జేసిననాలుకఁ గోయించెదరు. బ్రాహ్మణులనే యవయవముతోఁ గొట్టెదరో యాయవయవము నరికింతురు. బ్రాహ్మణుఁడే యీజగమున కధిపతి యనియు నుత్కృష్టపురుషుఁడనియుఁ జెప్పు ప్రమాణముల నచ్చటచ్చట గ్రంథములందు నిరికించిరి. ఎప్పుడైన వారి యాజ్ఞ నుల్లంఘింపఁ దలంచినచో నాప్రమాణముల నాధారముగాఁ జూపుదురు. వారి ప్రమాణము లసత్యములైనను మొండియెద్దైన నా యెద్దే గెలువవలయునన్నట్లు వారిపట్టును వారువిడువకున్నారు. ఆపట్టువిడిచిన నిరుద్యోగ మాయాజీవనము గడచుటెట్లు? బ్రాహ్మణులచే

చెప్పఁబడిన ప్రమాణములే సత్యములన్న నందులకు వ్యతిరేక ప్రమాణములు ముక్కలిగలవు. అవి బ్రాహ్మణవాక్యములవలె స్వవచనవ్యాఘాతదోషములతో నిండియుండలేదు. ఇట్లు బ్రాహ్మణులు తమ మాయాకల్పిత ప్రమాణంబుల సహాయమున బ్రాహ్మణేతర సత్వములను హరించినందునఁ దత్సత్వ సంపాదనమునకై బ్రా॥ ఇ॥ సంఘమునొక దానిని నెలకొల్పితిని బ్రాహ్మణప్రియులగు బ్రాహ్మణేతరులచే మందలింపులు, బెదిరింపులు, గొంటింపులు, చీవాట్లు, చెప్పుదెబ్బలు, అనుభవించుచు నాసర్వస్వ మర్పించి సేవసేయుచుంటిని.

బ్రాహ్మణాభిమానముచే బ్రాహ్మణేతరులెవ్వరైన నేనికములు నవమాన మొనరించినను, కష్టపరంపర లందఁజేసినను, ఇందు కొక్కఁడునైన వెనుకకు మరలజాలను.

ధర్మ ఖడ్గముఁ జేబూనితిని. ధర్మమూర్తియగు నీశ్వరుఁడా ఖడ్గమున మూర్తీభవించి యున్నాఁడు. దానికిల నసాధ్యమొండును లేదు. అయ్యదియే యసత్యము నన్యాయమును రూపుమాపి విశ్వవ్యాపియై నాశనరహితమై నిరంతరము భాసిల్లుచుండును. కావున సత్యయుక్తమై ధర్మయుక్తమై యొప్పుచున్న నాయుద్యమము తప్పక గెలుపొందునని విశ్వసించుచున్నాను.



శ్రీ

# బ్రాహ్మణేతర విజయము.

## ఆంధ్రక్షత్రియుల తుదిసిద్ధాంతము.

సీ॥ మునిచిపోయిరి సు • మ్మామెమ్మసాని శ్రీ
రామనృపాలు ప • రాక్రమంబు
తెలియఁగోరరుసుమీ • దీనులై గావెళ్ళ
వీరమల్లని భుజ • విక్రమంబు
యోచించరుసుమీ య • శోమయంబునఁబడి
వాసిరెడ్డి విభుని • వైభవంబు
తలచఁబోవరు సుమీ • కలనైన సూర్యదే
వరతిమ్మభూపాలు • పౌరుషంబు

గీ॥ అరయఁబోరుసుమీ నేటి • కైనమీరు
(పం) కమ్మవీరుల పూర్వశౌ • ర్యమ్ముసుంత
లెండులెండు సోదరులార • లెండులెండు
సంఘసేవను సేయంగ • సాగిపొండు
సరసమతులార చౌదరి సభ్యులార॥

బాలకవి కొసరాజు రాఘవయ్య చౌదరి.

పూర్వము ద్రావిడ దేశపరిపాలకులైన చోళచాళుక్యు లేమైరో యనియు కమ్మ, రెడ్డి, బలిజ, వెలమ శాఖలవారె చ్ఛటివారనియు దీర్ఘ విచారణజేసినవారికి కమ్మ, రెడ్డి శాఖలవారు చోడులనియు వెలమ బలిజ శాఖలవారు చాళుక్యులనియు విశదమునుగాకపోదు. ఈవిషయమై చదువరుల సంశయ నివారణార్థము కొన్ని ప్రమాణముల నిందుదాహరించెద.

## రెడ్డివారు చోడులు.

వీరు తెలుగుచోడుల శాఖలోనివారని కొందరు తలంచుచున్నారు. ఈయూహకొక కారణము గన్పట్టుచున్నది. అభినవ భట్టబాణ విరచితమైన వీరనారాయణ చరిత్రమను నామాంతరమున న్యవహరింపబడు వేమభూపాల చరిత్రమున పంట వంశములోని వారి పూర్వులలో కామభూపాలుడను వాడొకడు. అద్దంకి రాజధానిగా తెలుగు దేశమును బరిపాలించెనని నుదహరింపబడెను. నెల్లూరి మండలములోని కావలి గ్రామమున నొక శాసనములో జగనొబ్బగండ కామయ చోడుడను కామయదేవ చోడుడను నొక మహారాజు నామము గన్పట్టుటచేతను, పాకనాడు పంటరెడ్లకు ప్రధాన స్థానముగా నుండుటచేతను, అద్దంకి ప్రథమమున రాజధానిగా నుండుటచేతను, సాధారణముగా వేమభూపాల చరితమున నుదహరింపబడిన కామభూపాలు డీకావలి శాసనములోని జగనొబ్బగండ కామయదేవచోడుడై యుండవచ్చునని యూహించుట కవకాశము గల్గుచున్నది. కావున వీరు తెలుగు చోడులతో సంబంధము గల్గియుందురని



క్టరు హల్టుగారు వ్రాసియున్నారు. ఈరెడ్డిరాజులు చోడులతో సంబంధబాంధవ్యములు నల్పుటచేత డాక్టరు హల్టుగారు దలంచినటులు రు తెలుగు చోడులలో నొక శాఖవారనిగా మనమూహింపవచ్చును.

ఆంధ్రుల చరిత్ర 3వ భాగము. 131. 132. పేజీలు.

" శచీవశక్రస్య శివేవశంభోః పద్మేవసా పద్మవిలోచనస్యవే మాంబికా చోళకులేందు భీమభూపాత్మజా భూన్మహిశౌర్యజాయా"

గోరుమిల్లి శాసనము.

అని భక్తీశ్వర చోళనృపాలు పుత్రుండు భీమభూపాలు పుత్రిక ను వేమాంబికను వివాహము జేసికొనెనని చెప్పఁబడి యుండుట త.

ఆంధ్రుల చరిత్ర 3వ భాగము 263వ పేజి.

ఈప్రమాణములు రెడ్లు చోళులగుదురని తలంచుటకనువగు న్నది. ఈకమ్మవారు చోళులనుటకు ప్రమాణము లేవనిన నిందుద రించెద.

## కమ్మవారు.

అక్ష్యవంశమున జనించిన భీమయ్య యను కమ్మనాయకుఁడొ డు వెలనాటిలోని క్రొయ్యూరునందు నసించియుండెను. ఆభీమనా యకునకు రాజాంబికవలన జల్లయ్య, నారయ్య, సూరయ్యయను మూ రు పుత్రులు జనించి వెలనాటి చోడమహారాజు కొలువున నుద్యోగ ములను వహించియుండిరి.

ఈసైన్యాధ్యక్షులైన నాయకునకు చోడినాయకుఁడు, భీమనా యకుఁడు, పిన్నచోడినాయకుఁడు, బ్రహ్మనాయకుఁడు నను నల్గురుపు

త్రులు జనించి వెలనాటి చోడరాజునకు సైన్యాధిపతులై చతుస్స
ముద్రములవలె నుండి దేశమును శత్రుబాధనుండి సంరక్షించుచుండి

ఆంధ్రుల చరిత్ర. 2వభాగము. 241, 250 పేజీ

ఈ పై వాక్యము. కమ్మకులజులు. చోడుడు. పిన్నచోడుడు
అను నామములుధరించి వెలనాటి చోడుని కడ సైన్యాధ్యక్షులైయుండి
రని చెప్పుట చూడగా కమ్మవారు చోడులనుటచే తనకమ్మకు
జులు. చోడుడను నామమును ధరించిరని సుబోధకమగు చున్న
యీయంశమును నిదిగువ ప్రమాణము సిద్ధాంతము చేయుచున్న
పరిశీలింపుడు.

కమ్మవారు. తాము దుర్జయకులాభరణులమని చెప్పికొన్న
టుల ఆంధ్రులచరిత్ర 2వభాగము 1[illegible] పేజీలో నిరూపింప బడియున్నది
ఆదుర్జయ కులమును గురించి చాతుర్వర్ణ్యములలోనే వర్ణనమాయనిది
రించ ఆంధ్రులచరిత్ర 2వ భాగము 146వ పేజీలో

## దుర్జయ కులము.

ఆగణపతి రాయని శాసనములందే సూర్యవంశమున మనువు,
అతనివంశమున నిక్ష్వాకువు అతనివంశమున రఘువు అతనివంశమున
దాశరథి అతనివంశమున కరికాల చోడుడు. అతనివంశమున దుర్జయుడు
అతనివంశమున కాకతి బేతరాజును జనించిరనియు దుర్జయుడు కాక
తీయులకు పూర్వుడనియు చెప్పబడినది.

ఈప్రమాణమును బట్టి దుర్జయుడు. కరికాల చోడవంశములోని వాడని
యు కాకతీయులకు మూల పురుషుడనియు గ్రాహ్యంబగు చున్నది. కాక



ములు పలుతావుల. కమ్మవారివలెనె. దుర్జయకులాభరణులమని
ప్పుకొని యున్నారు. అటుల చెప్పుకొనుట చూడ. కాకతీయులు
మ్మవారు దుర్జయుని వంశమువారనియు దుర్జయుడు. చోడవంశసంభ
వుడనియు ధృవంబగుచున్నది. దుర్జయుడు చోడుడైనపుడు అతనివంశము
నగు కమ్మవారు. కాకతీయులు చోడులనుట కిసుమంతయు సందియ
ముండదుగదా. కాకతీయులు కమ్మవారుగాక సాగివంశము వారును
ర్జయ కులాభరణులమని చెప్పికొన్నవారే. ఇవ్విధిని దుర్జయవంశము,
కమ్మవారు 2. కాకతీయులు 3. సాగివంశమువారుగా చీలి ఆకాకతీ
యులిపుడు మందపాటివారను నింటిపేరుతో సూర్యవంశక్షత్రియులు
ను ఆసాగివారిపుడు వత్సవాయవారను నింటిపేరుతో సూర్యవంశ
క్షత్రియులుగాను వ్యవహరించబడుచుండ కమ్మవారినిగురించి ఏవర్ణమూ
నివితర్కించుకొనుటకంటె వేరు వెట్టియుండబోదు.

## వెలమవారు.

వెలమవారు చాళుక్యులగుదురాయను ప్రశ్నకు కీర్తిశేషులయిన
॥ రా॥ రా॥ శ్రీ కొమఱ్ఱాజుల లక్ష్మణరావుపంతులుగారు 1924సం॥
వెలువడిన శారదపత్రిక 2వ సంపుటము 1వ సంచికయందు
ళుక్యులు దాక్షిణాత్యులేనని వ్రాసిన వ్యాసములో జవాబుగలదు.
ద్దానినిందుదాహరించెద పరిశీలింపుడు.

అరవమునందు 'దివాకరమ్' అనుపేరుగల కోశముగలదు. ఇది
0 వ శతాబ్దపు ప్రాంతపుది. ఇంతకంటెను ప్రాచీనమని చెప్పువారు
గలరు. ఇందు "చళిక్యవేందర్" "వేళ్కుల అరసర్ అనుపద
ములు పర్యాయపదములుగ నీయబడినవి. "చళుక్య రాజులు" వేళ్

కులన్నవతులు" అని యీపదముల కర్థము. అనగా నాకాలమున చా
ళుక్యులు వేళ్‌కులమువారన్న సమ్మికయుండెననుట స్పష్టము. వేళ్‌కుల
మువారి నిప్పుడు వెల్లాళ్ " అందురు వీరుశూద్రులు, తెలుగులో
వెలమవారు కన్నడములోని వక్కలిగర్ మొదలయిన జాతులు వే
జాతులనియే చెప్పనచ్చును. వీరందరు మొదటనొక్క జాతివారే కా
దేశభేదములఁబట్టి వేర్లుమారుట సంభవించినవి.

"శారద 7 వ పేజీ.

పై ప్రమాణములనుబట్టి చాళుక్యనామము వెలమగా తెలుగు
నందు మారినదనుట స్పష్టము. మఱియు వెలమవారు చాళుక్యులగుట
చేతనే హైహావంశజుఁడగు అనుగురాజు వెలమయగు పెద్దన్నను పెంచు
కొని రాచకన్యయనంబడు లవాంబనిచ్చి వైవాహికముచేయుట కల్గి
నది. ఈ వైవాహికమునుగురించి పల్నాటి వీరచరిత్రకథాసారమునఁ అక్కి
రాజు ఉమాకాంతముగారీ క్రిందివిధమున వ్రాసిరి.

అనుగురాజుమంత్రి దొడ్డనాయుడు. ఇతడు వెలమ. బేతినాయుని
కుమారుఁడు దొడ్డనాయునికొడుకులు బాదరాజు, బ్రహ్మనాయుడు.
బాదరాజునకు పెద్దన్నయని నామాంతరముగలదు. సంతానముగల
గకముందు అనుగురాజుచేఁ బాదరాజు పెంచుకొనబడి క్షత్రియుండును
కంచర్ల పురాధీశుండును నైన కృష్ణగంధర్వునికుమార్తె లవాంబను పెం
డ్లాడెను." అని వెలమవారు శూద్రులైన క్షత్రియులైన అనుగురాజు
వెలమకులజుండగు బాదరాజును పెంచుకొని తనస్వకులకన్యను వైవా
హికముజేయుట కల్గజాలదు. కావున వెలమవారు చాళుక్యులనుట
ధృవము.



## బలిజవారు.

వీరు చాళుక్యులగుటచేతనే శ్రీకృష్ణదేవరాయ వంశజుఁడగు
అచ్యుతరాయలు, పట్టమహిషియగు తిరుమలాంబ చెలియలగు
మూర్తిమాంబను, బలిజ వంశోద్భవుండును, తంజావూరు పరిపాలకుం
డును యగు చెవ్వ విభునకిచ్చి వివాహము జేసెను. ఈవిషయమును
గురించి అచ్యుతరామాభ్యుదయమను గ్రంథములోని

గీ॥ శ్రీవి నచ్యుత రాయలు ♦ దేవియైన
తిరుమలాంబకు ♦ చెలియలై తేజరిల్లు
మూర్తిమాంబను ♦ పెండ్లియై కీర్తివెలయ
చెవ్వవిభుడుమహాజాన్నత ♦ శ్రీచెలంగ.

అను పద్యము సిద్ధాంతము జేయుచున్నది. ఆ చెవ్వవిభునివంశజు
లిప్పటికిని తంజావూరు జిల్లాలో నివసించుచు బలిజవారను నామ
ముతో వ్యవహరింపఁబడుచు రాజ్యాంగమువారికడ అలవెన్సుపొందు
చున్నారు. మఱియు మాచర్లలో చంద్రవంకతీరమునఁగలదని చెప్పఁ
బడుచు నీదిగువ వ్రాసిన శాసనమువలన నా సంశయము నివారణమగు
నని దానిక్రింద బొందుపరచుచున్నాను.

స్వస్తిశ్రీ శకాబ్దంబులు 1064అగునేటికి దుందుభినామసంవత్సర
శ్రావణశుద్ధ ఏకాదశి గురువారమున శ్రీమన్మహామండలేశ్వర అన్గుంగా
మరాజులు యూరియకామిసెట్టి శ్రీచెన్న కేశ్వరదేవర కిచ్చినతోట

ఆంధ్రులచరిత్ర విమర్శనము 142వ పేజి.

ఈశాసనమున కర్థమాంధ్రుల చరిత్రవిమర్శన జెప్పిన యర్థమిట
వ్రాసెద.

వీనిలో అన్నగామరాజులు యూరియ కామిశెట్టి యనువారలిరువురు చెన్నకేశవునకు తోటనిచ్చినటుల సామాన్యముగా నర్థమగా గలదు. పలగామరాజు నొకసెట్టియుగూడి యిచ్చట యనంభావితంబు యూరియ యనునది కామిసెట్టి గృహనామముగా గన్పట్టుచున్నది. నేను సంగ్రహించిన పాఠమున యలియ యనియున్నది. అన్నగామరాజుల యలియ (అల్లుడు) అగు కామిసెట్టియని యర్థమగును. ఈవాని యాపాఠమునుబట్టి కామిశెట్టి అన్నగాజు అల్లుడని తేలుచున్నది. కామిసెట్టి బలిజశాఖవాడని శెట్టిశబ్దమే చాటుచున్నది. అన్నగాజు హైహయుడుగ బా అట్టిచంద్రవంశజుడగు యన్నగరాజు కామిసెట్టి చాళుక్యుడగుటచేతను తనకుమార్తెనిచ్చి యున్నాడు

ఈపైన యుదహరించిన సారాంశమునుబట్టిచూడ కమ్మవారు, రెడ్డివారు, చోళులనియు వెలమవారు, బలిజవారు చాళుక్యులనియు సిద్ధాంతమగుచుండ శూద్రజాతియగు నందునివంశజులను టెట్లు ప్రాసగును.

## మహార్ణవమి పద్యములు.

అరివర్గముల గుండెలవదరునీధాటి । తురగపంక్తుల బారదోలునీమాటి ।
కరిఘటలంపురిగొల్పు గరిమనీవుగాక । దరిమిఘుంపుల సేయతగునీమలేఖ।
పరబలంబుల మన్మథంగమిరాక । చిరకీర్తి జయలక్ష్మి చేకూరుగాక ।
ధర్మమార్గంబులు దలచితివిగాక । సరస జేరినయర్థి జనులరక్షింప ।
కమ్మవంశమునందు ఘనుడవైపుట్టి । కరుణదలచితివార గాంభీర్యపురుష।



## సీసమాలిక.

శ్రీకటకర్ణాట సింహాసనంబున । నెల్లగారావెళ్ళ మల్లఘనుడు ।
త్యాగదర్పయంబొప్ప తగనర్థులకునిచ్చె । వెలమిసాయపనేని వెంకటాద్రి ।
అదిగర్భశ్వరుండతి కృపాభరితుండు । పెమ్మసాని కులుండుతిమ్మఘనుడు।
కొండపల్లీదుర్గ కువలయదేశాహి । విభవుండు అట్లూరి వెంగళన్న।
అమిత్రాశ్రితావళికమర భూజపుగుంపు । వెంచయూరలగడ్డ కంచినీడు।
దరికొండ పీటికి దత్తుడై విలసిల్లు । నావాసి రెడ్డి మల్లప్రభుండు।
రాజితపల్లకిరమణతోడుత నంటె । స్థిరమొప్పంగా కాజతిమ్మనీడు।
రామచండ్రినిరీశిరహివాశ్రితులబ్రోచు । బరికింపవెలమంచిపర్వతాలు।
దిగ్దేశములయందు స్థిరనిజకీర్తిచే । విలసిల్లు కోనేరు వెంకటాద్రి।
శత్రువై నసువచ్చి శరణువేడినగాచు । నధికుండురేగుల అంకినీడు।
కోటానకోట్లలో మాటనిల్కడగల్గె । నారపిన్నమనేనసంతవిభుడు।
సరసవైభవ భోగసామగ్రివేడ్కతో । సాటిసేయగ జాస్తి జగ్గఘనుడు।
పరగధర్మాత్ముండు పటుశౌర్యసింహంబు । జగతిపర్వతనేని జగ్గనీడు।
ధనధాన్య వస్తుసంతతులచే వర్ధిల్లె । ఘంకముగ కొమ్మినేన్వెంకటాద్రి।
రాజాధిరాజులు రమ్మనిమన్నింప । పెంపొందెను కొడాలి పేరినీడు।
భూరిప్రతాప విస్ఫూర్తిచేచెన్నొందె । గణుతింప మండవ గంగినీడు।
దానధర్మవివేక తారతమ్యమునెంచ । బాసర వెంగన్న ధర్మశాలి।
బాంధవపోషణ భాగ్యరేఖామహాధి । భాషింప వెల్లంకి బసివినీడు।
పౌరుషవంతుండై ప్రాభవోన్నతిగాంచె । నెలమితో కర్లపూడెల్లవిభుడు
సజ్జనుల్ నుతిచేయు సర్వకీర్తివహించె । ముదముతో ముల్లంకిమూర్తినీడు।
పేదసాదలనెల్ల నాదరంబునబ్రోచు । సరయూతమ్మారెడ్డి అంకినీడు।

